# విజ్ఞప్తి

బొంబాయి నగరంలో వ్యాపార, ఉద్యోగాల నిమిత్తం ఆంధ్రులు వలస రావడం, మాతృభాషా పఠనానికి సౌకర్యాలు లేనందువల్ల యితరభాషల్లో వారిపిల్లలకి విద్య నేర్పించడం, దానివల్ల, ఆంధ్ర బాల బాలికలు కాలక్రమాన మాతృభాష విస్మరించడం పరిపాటుగా వుండేది. ఈ పరిస్థితులు మార్చి, మాతృభాషా వ్యాప్తికి పాటుపడాలన్న ఆవేదనతో, పట్టుదలతో, పందొమ్మిదివందల నలభైమూడో సంవత్సరంలో శ్రావణపూర్ణిమా శుభదినంనాడు, బొంబాయి ఆంధ్రులు, ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసయిటీ స్థాపించారు. మూడుసంవత్సరాల్లో స్కూలు ఆరంభమై, ప్రతి సంవత్సరమూ పెరిగింది ; 1955 లో స్కూలుఫైనలుక్లాసు ప్రారంభ మవుతుంది.

స్కూలుతోపాటు బాధ్యతలూ పెరిగాయి. సంవత్సరానికి అయిదారువేల నష్టం విరాళాల రూపంగా వసూలు కావాలి. అద్దె కొంపలోవున్న స్కూలు స్వంతభవనంలోకి మారాలి. అనువైన స్థలం దొరికింది. భవనం లేవడమే తరవాయి.

విద్యాసంస్థలు ఏనాడూ స్వయం పోషకాలు కావు. ప్రజా, ప్రభుత్వ సహాయాలు అవసరం. బొంబాయి ఆంధ్రులూ, ప్రభుత్వమూ కూడా సహకరించి సహాయం చేస్తున్నా దానిపోషకం, కేవల బొంబాయి ఆంధ్రుల శక్తికి మించిన కృషిగా పరిణ

మిస్తోంది. ఆ మహత్తర కృషికి ఈ నా పుస్తకం ఒక చిన్న కానుక. దీనిని మిత్రులు అద్దేపల్లి నాగేశ్వరరావుగారు ఉచితంగా ముద్రించి ఆదాయం స్కూలుకి విరాళ మివ్వడానికి అవకాశం కలిగించారు. వారికి బొంబాయి ఆంధ్రుల తరఫున నా కృతజ్ఞతాభి వందనాలు.

లభించిన సహాయానికి కృతజ్ఞులం. కాని ఇంకా సహాయం కావాలి.

ఈ నాటకాన్ని ప్రత్యేకంగా నా అనుమతి కోరకుండా ఎవరైనా ప్రదర్శించుకో వచ్చును. ప్రదర్శించినప్పుడు మాత్రం కనీసం అయిదురూపాయలయినా స్కూలుకి విరాళంగా పంపించా లని ప్రార్థన.

బిడ్డలు తమ కాళ్ల మీద నిలబడే దాకా తల్లిదండ్రుల సహాయం ఆపేక్షించడంలో అసంగతం, ఆశ్చర్యం లేదు. కనుక దూర రాష్ట్రాలలోవున్న ఆంధ్రమాత బిడ్డలం మాతృరాష్ట్రంనించి, ప్రభు త్వం నించి ఇతోధికంగా సహాయం కోరుతున్నాము. ఆదరణతో చేరదీసి విరాళా లిచ్చి, పాఠశాలాభివృద్ధికి తోడ్పడగల రని ఆశిస్తున్నాము.

విరాళాలు, ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసయిటీ కార్యదర్శి పేర [Ex - Military hutment T. 57, Sion Road Bombay 22 ] పంపితే కృతజ్ఞతతో స్వీకరింపబడగలవు.

సోమంచి యజ్ఞన్నశాస్త్రి

# నాలుగు ప్రదర్శనాలు

మాయనొప్పులు

రిహార్సలు

ప్రదర్శనము

ఆంధ్రనాటకరంగానికి జై

# మా య ను ష్యు లు

[తెరతీసేసరికి రామకృష్ణ, గోవిందం వుంటారు. రామకృష్ణ పేపరు చదువుతూవుంటాడు. గోవిందం మంచినీళ్ళు తాగుతూవుంటాడు. రామకృష్ణుడు పైకిచూసి, పేపరు కిందపారేసి]

రామ — ఏమండీ, ఆరుగంట లయిపోయింది. ఇంకా ఎవరూ రాలేదు. అస లెవరన్నా వొస్తారనుకుంటారా ? నాకు భయంగానే వుంది.

గోవిం — ఈమాత్రానికే ఝడిస్తే ఎలాగ ? ఇది హిందూ దేశమా, మరోటా ? పైగా స్వరాజ్యంకూడా వొచ్చేసింది ; ఇహ అడిగేదేమిటి ?

రామ — మరీ ఇంతలేటా, అయిదుగంటలకి కలుసుకుందా మనుకున్నాము.

గోవిం — ఈ విషయంలో మనవాళ్ళందరూ, గిరీశంగారు చెప్పినట్టు, వొట్టి వెధవలండీ, కాలంవిలవ తెలీదుగా ఎవరికీ, ఇంకోసంగతి కనిపెట్టారా ? ఎవరిమటుకు వాళ్ళే, మిగాతా వాళ్ళందరూ ఎలాగా టైముకిరారు, నే ఒక్కడినీ వెళ్ళిమాత్రం ఏంచేస్తాను, అని లేటుగా బయలుదేరుతారు. చివరికి ఉండేవి, బల్లలూ కుర్చీలూను. ఒక్కొక్కప్పుడు అవీ వుండవనుకోండి ఇది ప్రతిమీటింగుకే వున్న భాగోతమేగాని....వాళ్ళొచ్చేలో

నా స్వవిషయం కొంచెం చెప్పుకోవాలి మీతోటి....మనం వెయ్యబోతున్నామే....ఆ నాటకంలో మీరు కొంచెం కనిపెట్టి నాకు పాత్రయివ్వాలి.

రామ — అప్పుడే పాత్రలివ్వడందాకా వొచ్చేశారూ, నాటకమన్నా నిర్ణయం కాకుండా! పైగా నేనిచ్చేదేమిటి? నాటకం అందరూ చదివినతరవాత, మనలో ఏపాత్రకి ఎవరు అర్హులని తోచితే, ఆ పాత్ర తీసుకోడమే.

గోవిం — అలాఅయితే చంపేస్తారండీ....మీరు నాటకాల్లో అనుభవం లేనివారు, మీతో అంతా విప్పి చెప్పుకోవాలిగదా! కానివ్వండి, చల్లకొచ్చి ముంత దాచడమెందుకు? నేను ఇరవై ఏళ్ళనించీ నాటకాల్లో తిరుగుతున్నాను. ఈ మధ్య అయిదారేళ్ళనించీ కొంచెం జోరు తగ్గిపోయిందనుకోండి....కనక ఇప్పటి కుఱ్ఱకారుకి నా తడాఖా అంత తెలీదు. ప్రచండచాణక్యంలో చాణక్యుడు, చంద్రహాసలో దుష్టబుద్ధి వేసేవాడిని....ఇప్పటి నా ఆకారం చూసి, వీడేంవెయ్యగలడని తీసెయ్యకండి....ఒక్కమాటు నన్ను స్టేజిమీద కెక్కించి చూడండి. అయితే స్టేజిమీద కాస్త స్వతంత్రమివ్వాలి. అంతేగాని, నాటకానిక్కూడా ఓ డైరక్టరు, ఆ డైరక్టరేమో, ప్రతినటకుణ్ణీ పట్టుకుని, నువ్విక్కడనుంచో, నువ్విక్కడ కూచో అని తాళ్ళెట్టి కట్టేసి, స్టేజిమీద నించోబెడతానంటే, నాబోటి నటకులు అట్టే రాణించరు! మీరు నన్నోకంట కనిపెడితే....

[అంటూవుంటే నారాయణ ప్రవేశిస్తాడు]

నారా — [అంతా కలియజూసి] ఇంకా ఎవరూ రాలేదేం ? (అని వెళ్ళి కూచుంటాడు)

గోవిం — నే నిక్కడుండగానే ఎవరూ రాలేదంటా రేమిటి ?

రామ — మీరూ ఇంత ఆలిశ్యంగా వొచ్చారేమిటి, చెప్పండి ?

నారా — అబ్బబ్బ. ఆఫీసులో చచ్చిపోతున్నానండి. వెళ్ళిన దగ్గిర్నించి, వొచ్చేదాకా పనే. మా బాస్ అన్నిటికీ నన్నే పిలిచి, నా సలహాయే తీసుకుంటాడు ! నామాటమీదే నడుస్తాడు. మరి పెందరాళే రావడానికి ఎలావీలు చెప్పండి.

[అంటూవుంటే మాధవుడు ప్రవేశం]

నారా — (దూరంనించే చూసి) హే మాధవా ! ఏమీ పనిలేని వాడివి నువ్వుకూడా ఆలిస్యంగా వొస్తే ఎలాచెప్పు.

మాధ — అందుకే మరీ ఆలిశ్యమయిపోయింది. (వెళ్ళి కూచుని) పనిలేదుకదా అని పడుకుంటే, లేచేసరికి అయిదున్నర అయిపోయింది.

రామ — ఏమి పడకండి మీది, పొద్దున్న తొమ్మిదిగంటలి కొస్తే లేవలేదన్నారు, మళ్లీ సాయింత్రం అయిదున్నరదాకా నిద్ర.

మాధ — నిన్నరాత్రి తెల్లారేదాకా పేకాడి, తెల్లారిపోయింది కదా అని హోటల్లోనే మొహంకడిగి, నాలుగిడ్డెన్లు, కాఫీ కడుపులో పడేసి ఇంటికొచ్చి పడుకున్నామండి.

రామ — సరిసరి. పనిలేకపోవడమేమిటి మీకు, పేకాటని మించిన పనేముంది లోకంలో....

మాఘ — ఎంతమటుకయింది ?

గోపాం — ఏదీ ఒక్కొక్కరే అవతరిస్తున్నారు.

మాధ — మీవరస చూస్తే నాలుగున్నరకే వొచ్చి కూచున్నట్టుంది....ఇంకా ఎవర్రావాలి ?

నారా — గోపాలం, కేశవుడూ రావాలనుకుంటాను.

[గోపాలం ప్రవేశిస్తాడు.]

నారా — (రావడం దూరంనించే చూసి) రా, నాయనా రా. ఎన్నేళ్లు ఆయుష్షు కావాలండి మీకు.

గోపా — (వింటునే) పైకే చెప్పాలంటావా, నాలో నే ననుకుంటే చాలా ?

నారా — ఎలా అయినా, సరే. మీకు కావలసినన్నేళ్లు బతకండి.

గోపా — (కూచుని) మెనీథాంక్స్ సార్....నే బతకడానికి మీ పెర్మిషన్ ఇచ్చినందుకు !

మాధ — ఇహ అందరూ వొచ్చినట్టే, కానివ్వండి. కేశవుడు వొచ్చినా, రాకపోయినా ఒకటే. మనం అందరమూ ఏమిటంటే, వాడూ అదే అంటాడు. రామకృష్ణగారూ మొదలెట్టించండి.

రామ — మనం ఇక్కడ ఏ వుద్దేశంతో సమావేశమయినదీ రెండు ముక్కలు చెప్పి, మన ప్రస్తుతవిషయాని కొచ్చేస్తాను.

నారా — ఓ యెస్, అలాగే!

రామ — ఇప్పుడు నాటకరంగం అన్నదిలేదు. చివరకి నాటక శాలలన్నాలేవు. అన్నీ సినిమా థియేటర్లయిపోయాయి. కొంత మంది నటకులూ, కంట్రాక్టర్లూ మాత్రం మిగిలారు. ఇందులో ఎవరి పొట్టకోసం వారు పాటుపడతారు కనక కళకోసం పాటు పడేందుకు ప్రత్యేకంగా ఎవరూరారు. గొప్ప లాభాలకోసం, పెద్ద నటకుల పేర్ల జాబితాలు అడ్వర్టయిజు చెయ్యడం, వాళ్లు రాక పోడం, గుద్దులాటలూ, ప్రతినాటకానికీ మామూలయిపోయాయి. ఈ స్థితిలో ఏవో కొన్ని పాతనాటకాలే పట్టుకుని కొంతమంది నటకులూ, కంట్రాక్టర్లూ తంటాలుపడుతున్నారు గాని, కొత్త నాటకాలు వెయ్యడంగాని, వ్రాయడంగాని జరగడంలేదు. నాటక రంగాన్ని ఈ దుర్గతినించి తప్పించాలంటే, మనబోటివాళ్లెవరన్నా పూనుకుని కొత్తపద్ధతులమీద కొత్తనాటకాలు ప్రదర్శించి, చూపిం చాలి. కనక మన మేదన్నా కొత్తనాటకం తీసుకుని ఆదర్శంగా ప్రదర్శించాలని నా వుద్దేశం.

గోవిం — చాలా చక్కగా ఉపన్యసించారండి.

[అని ఒక్కడూ చప్పట్లు కొడతాడు.]

నారా — నేనుకూడా నాటకాల్లో తిరిగినవాడినే కనక, నేనూ తోచిన ముక్కలు రెండు చెబుతాను.

గోవిం — ఎందు కనవసరంగా పెద్ద ఉపన్యాసాలు. వెంటనే నాటకం నిర్ణయించి పని ప్రారంభిస్తే బాగుంటుంది.

నారా — (మొహం చిన్నబుచ్చుకుని) అలానే కానివ్వండి. ఉపన్యాస మివ్వాలని నాకేం బలవాటంగా లేదు.

మాధ — అయితే తగాదాయేలేదు. ఇహ నాటకంసంగతి ఆలో చించుకోవచ్చు.

గోపా — ఆలోచించండి, రామకృష్ణగారు.... మీరేదో కొత్త నాటకం, కొత్తనాటకం అని తహతహ లాడుతున్నారుగాని, నాటకం కొత్తదిగదా అని ఏచెత్తయినా వేసెయ్యకండి. దెబ్బ తింటాం, పాతచింతకాయ పచ్చడిలాగ, పాతకవులే, పాతనాట కాలే ప్రశస్తి. లేకపోతే డబ్బురాదు.

రామ — డబ్బురావడమే మనం ప్రధానంగా పెట్టుకోకూడదు.

గోపా — డబ్బుక్షౌరం చేసుకోడం ప్రధానంగా పెట్టుకోవాలా ?

గోవిం — అబ్బ పూరుకోండీ. ఒకచే నోటిరంకు మీద.... అయ్యా వీరిమాట కేమిగాని, కళాదృష్టితోనే నాటకం నిర్ణయించు కోవాలి.

గోపా — అలానే కానివ్వండి. చేతులు కాలితేనేగాని, ఎవ డికీ బుద్ధిరాదు.

గోవిం — మనం వేసేది వచననాటకమా, పద్యా లుండొచ్చా ? అదితేల్చుకోవాలి ముందర, నావుద్దేశంలో, వచననాటకం వేస్తేనే....

నారా — వచన నాటకాలు ! సాంబారు, చట్నీలేని ఇడ్లీలాగ, పద్యంలేకుండా నాటకమెందుకండీ ? పద్యంలేకపోతే నాటక మేమి రక్తికడుతుంది. ఒక్కపద్యం విసిరితే, చప్పట్లు పడొద్దూ ?

రామ — మనం నాటకమేసేది, పద్యాలుచదివి చప్పట్లుకొట్టించుకునే టందుకు కాదుగా !

నారా — ఏమీ బాగాలేదని తిట్టించుకునే టందుకా రేకపోతే? ఎందుకొచ్చిన మాటలండీ ఇవి. రసవత్తరమయిన పద్యాలునాలుగు నుప్పించే సరికే, హాలు గుమ్మెత్తిపోవద్దూ. (ఒక పద్యంచదివి) నాటకమూ రక్తికడుతుంది. మిగతాది ఎలావున్నా కమ్మేసుకుంటుంది.

రామ — అదేమీ జరక్కుండా వుండాలని నావుద్దేశం. ఈ తుక్కునాటకాలు చూడ్డంవల్ల మన రుచి మరీ చెడిపోతుంది. నాటకం ఎంత పాడుగావున్న ఎవరన్నా రెండుపద్యాలు ధాటీగా చదివేసరి, ప్రేక్షకులు తృప్తిపడిపోతారు. ఆ నాటకంలో పద్యాలు బాగాలేకపోతే నాటకం మధ్యలో ఆపేసి, మరోనాటకంలో పద్యాలు, ఏసినీమాపాటలో పాడించేస్తారు' ఆ దురలవాటు మానిపించాలి.

మాధ — నిజమే. అంతగా పద్యాలు కావాలంటే, తెరవెనకనించి, సీనుకీ, సీనుకీ మధ్య చదువుతేసరి !

నారా — తెరవెనకనించి చదవడంవేం ? మొగాళ్ళంకాదూ ?

గోవిం — మొగాళ్ళమయితే, పద్యాలూ, గిద్యాలూ లేకుండా, నాటకమేసి రక్తికట్టించాలి.

నారా — అలాటి నాటకమేసి చెప్పుదెబ్బలు తినాలి. అనవసరంగా వాదోపవాదాలు పెంచకండి. పద్యాలులేని నాటకంవేసి లాభంలేదు. వెయ్యకూడదు. మీరువేద్దామని అనుకుంటే, అందులో నేనేమీ పార్టు తీసుకోను.

మాధ — భేష్ ఏమండీ, గోవిందంగారు. నాటకంలో పద్యాలుంటే, మీరు పార్టుతీసుకోరా ?

గోవిం — తీసుకోకేం నాకు పద్యాలులేని పోర్షను తీసుకుంటాను. ఓవేళ పద్యాలున్నా, అవి తీసేస్తాను. చదవను.

నారా — బతికిస్తారు. అష్టమయినవాడూ పద్యాలు చదవడానికి ఒంకించుకుంటేనే, పద్యాల విలవాపోతోంది. నాటకాల్లో పద్యా లుండకూడదని వాదనా బయలు దేరింది.

గోవిం — లోకంలో మీరుతప్ప మరెవరూ పద్యం చదవలేరను కోకండి. తలుచుకుంటే నేనూ చదవగలను ; లక్ష.

మాధ — అబ్బాలక్ష. మచ్చుకి ఒకటి శలవివ్వండి !—

గోవిం — కబుర్లు చెప్పొచ్చారు. పద్యాలేమిటో పాడిచేస్తా యనుకుంటున్నారు కాబోలు. రౌద్రం మొప్పించడానికి, వచనం ముందు పద్యం ఆగుతుందిటండీ ! (కూచున్నవాడు అకస్మాత్తుగా లేచి కత్తి ఝళిపిస్తున్నట్టు) ఓరసపుత్ర యోధులారా ? నిలుడు నిలుడు. దుర్గాదాసు కంఠమున ప్రాణముండ మీకీవెరపేల ?

మాధ — (మాటలో అందుకుని) కూరుచుని మాటలాడక ఇటు లకస్మాత్తుగా తమరు లేచుటేల ? (గోవిందం [illegible] కుని కూలబడతాడు) ఇంతకీ ఎవడండీ, ఈదుర్గాదాసు ?

గోవిం — దుర్గాదాసు తెలీదుటండీ....దుర్గాదాసు.... ఔరంగ జేబుతో యుద్ధాలు చేశాడు. రసపుత్రయోధుడు.

మాధ — ఓరినాయనా : ఎంతదూర మెళ్ళారండీ ; మీకు తెలుగు వాడెవడూ దొరకలేదూ ఆమాత్రం గొప్పవాడు.

గోవిం — ఆమాత్రం గొప్ప తెలుగు కారక్టరు, లేకేం. యుగంధరు డున్నాడు. ఏమండీ, ప్రతాపరుద్రీయం వేద్దాం. అందులో నారాయణ గారికి పద్యాలూ వున్నాయి. నేవెయ్యడానికి మంచి కారక్టరూ వుంది. ఆహాహా, యుగంధరుడు ఏం గొప్పవాడండీ బ్రహ్మాండమయిన కారక్టరు. ఇదివరకు నేనోమాటు పుల్లెలూ అవీ పెట్టుకుని స్టేజిమీది కొచ్చేసరికి, చాలమంది ఝడుసుకున్నారు. (లేచి నటిస్తూ)

నేర్చుకోండిరా, శిష్యులూ, నేర్చుకోండి....
అండజభీము డండడడ, డండడ....
స్వామీ ఇదెప్పు డవుతుంది ?
ఇది ఆఖరవదు; అనంతం !
అనండిరా, వెధవల్లారా, అనండి !
“ అల్ల వాడిల్లహో, ఇల్లవాడల్లహో

కళ్ళులేని కబోది కడతేరినాడు !"
(ఆవలించి) వింతలేని ఆవలింత వుండదు
గుడగుడశబ్దం, కుండకే నష్టం !

[మాధవుడిమీదికి ఒక్కదూకు దూకుతూ]

ఢిల్లీసుల్తాన్....పట్టుకపోతాన్

[మాధవుడు ఉలిక్కిపడి కుర్చీతోనే వెనక్కి పడతాడు, గోపాల్, అతను పడకుండా పట్టుకుంటాడు.]

గోపా — భయపడకు నాయనా, భయపడకు : బూచాడు గాడు, గోవిందంగారే.

గోవిం — (కోపంతో) మీ రేదో చాలా తెలివిగా మాట్లాడు తున్నా ననుకుంటున్నారు కాబోలు.

గోపా — మీ రేదో చాలా గొప్పనటులని అనుకుంటున్నారు కాబోలు.

గోవిం — సంతోషించాం. తగ్గండి.

గోపా — మేం మరీ సంతోషించాం. మీ రంతకంటె ముందుగా తగ్గండి.

నారా — మీ రుభయులూ వూరుకోండి అసలు. నాటకంసంగతి తిన్నగా ఆలోచించనివ్వండి....ఈ చారిత్రక నాటకాలు కాకుండా, పౌరాణిక నాటక మేసుకుంటే, బాగుంటుందనుకుంటాను. పుణ్యం, పురుషార్థం కలిసొస్తుంది. పాండవ ఉద్యోగవిజయాలు వేసేస్తే సరి.

రామ — అదేంనాటకమండీ "మరియు" అని ఓ పద్యం "అయినను" అని మరో పద్యమూను.

నారా — ఉద్యోగవిజయాల్లో పద్యాలకి తప్పుపట్టుకున్నవారు మీ రొక్కరు కనిపించారండీ.

రామ — పద్యాల నేమీ అనలేదే నాటకం కాదన్నానుగాని....

నారా — మనం ఆ నాటకంవేసి నిర్వహించలేమేమోగాని, ఏం చక్కటి పద్యాలండి, "జెండాపై కపిరాజు" (అని రాగ యుక్తంగా చదువుతాడు.) ధర్మరాజుకి కూడా చాలా ఘాటయిన పద్యాలు పడ్డాయండోయ్.

"చచ్చిరి సోదరుల్"

మాధ — పద్యాలకి వూరికే వన్సుమోర్లు. భేషుగ్గా వుంటుం దండి. గోవిందంగారిలాటి లక్షపద్యాలు చదవగల నటకుణ్ణి దగ్గిర పెట్టుకుని, మనం వెయ్యలేక పోవడమేమిటి? మోస్టు ఇన్సల్టింగ్.

గోవిం — వేస్తే వీర రసోదితమైన నాటకం వెయ్యాలి. చంద్ర గుప్త వేస్తే....చంద్రగుప్త చాలా మంచినాటకం. రక్తికట్టదన్న భయముండదు. నాకు చాణక్యుడి పాత్ర అసలు అభిమానపాత్ర. ఇదివరకు నే ఎన్నోమాట్లు పిండిగొట్టేసిన నాటకం గనక మన కేమీ ప్రమాదముండదు.

గోపా — చూసేవాళ్ళకి ప్రమాదంగాని మీకేం? కాదా అంటే, నాటకం ఖూనీ అయిపోతుంది.

గోవిం — (ఆమాట వినిపించుకోకుండా) ఎవరురా, ఈ చాణక్యుని తృణీకరించువాడు ? వీడొక నిరుపేద పారుడని యెంచితివా, నరాధమా. నందవంశమును ధ్వంస మొనరింప కున్న నే జనకుని పుత్రుండనుకొను. నీ రక్తముచే రంజితమగు హస్తముచే నా శిఖను ముడివైచుకొందును. దుర్మార్గుడా. ఈ పారుని కఠోరప్రతిజ్ఞ తుదివరకు జ్ఞాపకముంచుకొనుము. ముందొక్కప్పుడు ఈ భిక్షుకుని పదతలమందే శిరమువంచి ప్రాణభిక్ష వేడుకొందువు. నీ వెంత అంగలార్చినను నేనాభిక్షను ప్రసాదించను. చాణక్యుడన్న నేమియనుకొంటివో ! నా రోషక షాయిత నేత్రసమ్ముఖమున హరిహరరుద్ర బ్రహ్మాదులయినను ఆగలేరు, నీవురా, చాణక్యుని తృణీకరించునది !

మాధ — సరిసరి, చాణక్యపూనంకూడానా ?

గోవిం — ఏమండీ, రామకృష్ణగారూ, చంద్రగుప్తకి ఒప్పు కోరూ. నాకు చాణక్యుడు వెయ్యాలని మహా యిదిగా వుంది. నారాయణగారు చంద్రగుప్తుడు పద్యాలు పెట్టుకోవొచ్చును కూడాను. బాబ్బాబు. ఈ ఒక్కమాటు ఒప్పుకోరూ (అని లేచి గడ్డంపట్టుకు బతిమాలుతాడు.)

రామ — బాగానేవుంది, మన కథే రసకంధాయంలో పడు తోంది. ఇహ వేరేనాటక మేమేస్తాము.

[చంద్రగుప్త నాటకం వెయ్యడానికి ఎవరూ ఉత్సాహం చూపించకపోగా]

గోవిం — పోనీ, నారాయణగారికి నచ్చిన పౌరాణిక నాటకమే వేద్దాం....ఊ. చిత్రనళీయంవేస్తే బాగుంటుంది. నే బాహుకు డెయ్యొచ్చును....(అకస్మాత్తుగా లేచి) దమయంతి, దమయంతి, ఇది కలయా, కలయా....నమ్మజాల, నమ్మజాల....నమ్మకున్న ఈ జాబున కేమందును. దమయంతీ, నీ ద్వితీయ స్వయంవరమా? భూమ్యాకాశములారా. మీరేల ఏకముకారు. ఆకాశమా, నీవేల విరిగిపడవు. నక్షత్రములారా, మీరేల భగభగమండి, ఈ భువిని మాడ్చివేయరు. ఓ ప్రాణమా, నీవేల నానుంచి ఎగిరిపోవు?

మాధ — గోవిందా, మీరేల మా ప్రాణములు తీయుచున్నారు?

గోవిం — (చతికిలబడి) మీకు చెప్పి లాభంలేదు. ఏమీ సీరియస్‌గా తీసుకోరు మీరు.

మాధ — అమ్మమ్మ మిమ్మల్ని సీరియస్‌గా తీసుకోకపోవడమేమిటి? డేంజరస్‌గా కూడా తీసుకుంటాంగదా :....ఏమండీ రామకృష్ణగారూ ఇంతకీ ఆడవాళ్ళెవరైనా దొరికారా? అది చెప్పండి ముందర. లేకపోతే ఆడంగులులేని నాటకం చూసుకోవలసొస్తుంది.

నారా — నిజమేనోయ్. ఆడకారక్టర్ కుదరడం ఎంతకష్టంగా వుందని! ఆడవాళ్లు ఆడవేషమంటూ వెయ్యడ మొచ్చిన తరవాత

అర్థమైనదానికీ ధర పెరిగిపోయింది. అందరూ పెద్దపెద్ద ఇ
రుకే అయిపోయారు. కూనిరాగం తియ్యలేని దానికయి
దాని హార్మోనిస్టు స్పెషలుగా కావాలి. దానికిచ్చే కిరాయిగ
వెనకాల తఫిగిజతోంగాడొకడు. ఆడవాళ్లలేని నాటకం వే
బాగుంటుందేమో....ఆఁ. ఉద్యోగవిజయాలేస్తే, ఆ బాధుండ
సుమా. అందులో ద్రౌపది కారక్టరు వొట్టి నామ్ కే వా
మొగాడే వేసెయ్యొచ్చు. అంతగా కాకపోతే, ఆ ముక్క
రెండూ తెరలోంచే అనిపించెయ్యొచ్చు. ఊ....ఉద్యోగవిజయా
వేసేస్తే మంచిది.

గోపా — ఆడది లేకుండా నాటకమేమిటి ? వేసేవాళ్ల
మనకే ఉషారుగా వుండదుకదా, చూసేవాళ్ళేం ఆనందిస్తారు
మనకి డబ్బేంవొచ్చి ఏడుస్తుంది.

నారా — ఉషారుగా వుండనిమాట నిజమేమరి. ఏమండీ,
ఇంతకీ, ఆడంగులెవరూ దొరకనేలేదా ?

రామ — ముందు నాటకమేదో తేలినతరువాత, వాళ్లసంగతి
ఆలోచిద్దాము.

మాధ — మీ రలా అనడం భావ్యమా. వాళ్ళసంగతే ముందు
ఆలోచించాలి. ఈ సమావేశానికే, ఒక్క శ్రీమతికూడా
వొచ్చుంటే, ఎంత ఉత్సాహంగా వుండును చెప్పండి. గోపాల్
నీఎరికని ఎవరూలేరూ.

గోపా — ఎందుకులేరు? మీరు వెయ్యిరూపాయలు మనవి కావనుకుంటే, తీసుకొస్తాను చూడండి. గుమ్మెత్తిపోవాలి.

మాధ — వెయ్యిరూపాయలే!

గోపా — అరే బ్రదర్, ఏమీలేకుండా వ్యాపారం సాగాలంటే ఎలా? ఓ వెయ్యిరూపాయలు పెడితే, రెండువేలు రావడానికి ఛాన్సుంది. దమ్మిడీ ఖర్చెడతామంటే, కోలీకూడారాదు. నా మాట విని, నాలుగురూపాయలు పోతేపోయాయి, మంచి స్టార్‌ని బుక్‌చేసేద్దాం. అదే టిక్కెట్లమ్మెయ్యడం! హౌస్ ఫుల్. దడదడ వేసెయ్యొచ్చు. నెలకో కొత్తనాటకం!

మాధ — ఇప్పటిదాకా ఏనాటక మెయ్యడమో తెమల్లేదు. నెలలో కొత్తనాటకం వేస్తాట్ట.

గోపా — ఎందు కెయ్యలేము? నాటకం ఏదయితే ఎవడికి కావాలి. స్టారుని చూడ్డానికొస్తారుగాని జనం. నారాయణగారి పద్యమూ అక్కర్లేదు. గోవిందంగారి ప్రోజూ అక్కర్లేదు. మన స్టారమ్మగారు అలా స్టేజిమీదికి నడిచొస్తే, చప్పట్లు వన్సుమోరు!

గోవిం — అబ్బబ్బ. ఎంతకిర్ణకఠోరంగా మాట్లాడుతున్నారండీ! కళోద్ధరణకోసం రామకృష్ణగారు ఈ వుద్యమం తలపెట్టడమేమిటి? ఏదో, అంతో ఇంతో కళకోసం పాటుపడ్డవాళ్ళం, మేం ఆశపడి రావడమేమిటి? మీరొచ్చినదగ్గిర్నుంచీ డబ్బు, డబ్బు అనడమేమిటి?

గోపా — ఏం, మీకేం డబ్బు చేదా? కళోద్ధరణట! కట్టిపెట్టి వయ్యా కబుర్లు.

గోపిం — ఏమిటి మీవుద్దేశం ?

గోపా — నే చెబుతున్నానండీ, ఈ కళోద్ధరణగాళ్ళందర్నీని, క్షవరం ; సున్నయితే క్షవరం. పైలవరం రాజా, మోతే నారా రాయణరావు జమీందారు సంగతి జ్ఞాపకంలేదూ ! (లేచి) మీరు తగలేసుకున్నారు చాలదూ ? కళోద్ధరణ పేరుచెప్పి, అలాటినాలు కాల్లోకెదించి, వారినికూడా దివాళా తీయించకండి.

గోపిం — మాటలు కొంచెం జాగర్తగా రానిస్తే మంచిది. మీ రెందుకొచ్చారసలు. ఏమండీ రామకృష్ణగారూ, ఈయన్నెం దుకు పిలిచారిక్కడికి ? ఈయనికి నాటకం సంగతేం తెలుసు !

గోపా — నాటకంసంగతి నాకు తెలీనిది ఈలోకంలో లేదు. ఎవరనుకున్నారుపీడు ! రెండువేల మూడువందల నలభైతొమ్మిది నాటకాలు, రెండుకళ్ళతో చూశాను. తెలుసా. కలకత్తావెళ్ళి శిశిర్‌బహదూరీ నాటకాలు చూశాను. బొంబాయివెళ్ళి బాలగం ధర్వా, పెంఢార్కర్ నాటకాలు చూశాను. లాహోర్, పెషావర్ వెళ్ళి ఉర్దూనాటకాలుచూశాను. లైలామజ్నూ, షిరీన్ ఫరాద్, షోరాబ్‌రుస్తుం....మీ రెప్పుడైనా ఈ పేర్లన్నా విన్నారా ? ఇహ తెలుగునాటకాల సంగతి చెప్పనేఅక్కర్లేదు. యడవల్లి సూర్య నారాయణ మాయింటి పక్కింట్లోనే అద్దెకున్నాడు ఆరునెల్లు. స్థానం నరశింహారావుని, 'వానే' అని పిలుస్తాను నేను తెలి సిందా ? బస్తీమీద సవాల్. నాటకాల్ని గురించి నా అంత తెలిసినవా డెవడూలేడు.

గోవిం — భేష్, భేష్, నాలుగు నాటకాలు చూడగానే నాటకాల్లో ఎక్స్పర్టు అయిపోయారు. మిమ్మల్ని సమావేశానికి పిలవటం బుద్ధిపొరపాటు.

గోపా — మీ కే నాటకంలోనన్నా, ఎవడన్నా పోర్షనిస్తే, అంత కన్నా బుద్ధిపొరపాటు.

రామ — బుద్దర్నీ బతిమాలుకుంటాను, పూపుకోరా (అని వేరుచేసి, దూరదూరంగా కూచోపెడతాడు.)

నారా — కానివ్వండి నాటకమేదో తేల్చండి.

గోవిం — ప్రతాపరుద్రీయం వేసేద్దాం, ఆడవాళ్ళులేకుండా ఆడె య్యొచ్చు కూడాను, అవసరమైతే.

మాధ — ఇంకా ప్రతాపరుద్రీయాన్ని వొదల్లేదూ ?

నారా — ప్రతాపరుద్రీయంకంటె ఉద్యోగవిజయాలు బాగా రక్తికడతాయి !

మాధ — ఆ నాటకంలో అందరూ పద్యాలు చదవాలిగదా ! మాకు మీ రొక్కరుతప్ప పద్యాలయాక్టరులేరు. గోవిందంగారు లక్షపద్యాలు చదువుతామని, ఒక్కటి మచ్చుకూడా చూపించలేదు. ఏమండీ, సీరియస్గా అడుగుతున్నాను, మీకు నిజంగా పద్యాలు చదవడమొచ్చా ?

గోవిం — చంపేశారు.

మాధ — స్టేజిమీద పద్యాలు చదివేవారా ఏమిటి ?

గోవిం — నాఖర్మంకాలా, డెబ్బయిఎనభై రాగాలమీద పద్యాలు

చదివేవాడిని. నాగాత్రం ఎంత చక్కగా వుండేదని! అరమైలు దూరం సునాయాసంగా వినిపించేది.

**మాధ** — అబ్బా, మీరంత గొప్పవారని నిజంగా తెలీనేలేదండి' మరి పద్యనాటకాలు అక్కడ్లేదని వాదించారేం? మీ రిప్పుడు పద్యాలు చదవరా!

గోవిం — చదవడం మానేసుకున్నాలెండి.

**మాధ** — ఎందేత?

గోవిం — ఒకనాడు అకస్మాత్తుగా గొంతుకపోయేసరికి ఆడియన్సు ఏమీ మర్యాద లేకుండా చప్పట్లుకొట్టి అల్లరిచేశారు. అసలు నేనంటే కిట్టని వెధవలు కొందరు అల్లరిచేయించారనుకోండి. దాంతోటి, నాకు విరక్తిపుట్టిపోయి, ఛీ, ఈ వెధవమూకకి, ఇహ నాపద్యం వినిపించకూడదనుకున్నాను. అంతే. ఆనాటినించి, ఈనాటిదాకా మళ్ళీ పద్యం చదవలేదు. చాలా మందొచ్చి బతిమాలుకున్నారు గాని, ఊహూం.

**మాధ** — ఆడియన్సుకి మీపద్యం వినేయోగంలేకపోయింది' పోనిందిగాని, మనం ఇప్పుడు ప్రైవేటుగా ఉన్నాంకదా, ఒక్క రాగం వినవాలి. లేకపోతే మీకేంరాదు, డాబుతున్నారంటారు, నారాయణగారు.

గోవిం — గూబగుయ్యిమనిపించేవాడు లేకపోతే ఏదయినా అంటారు!

మాధ — పోన్లెండి. ఆయనసంగతెందుకుగాని, వినాలని నాకు చాలా ఇదిగావుంది. ఒక్కపద్యం …

గోవిం — రాగాలూ, పద్యాలూ, అన్నీ మరిచిపోయానండీ.

మాధ — మీరు మరిచిపోవడమేమిటి ? తలుచుకుంటే ఆమాంతంగా జ్ఞాపకానికి రావూ ? మొదలందుకుంటే చాలండి···వినరాలి ఒక్కరాగం, చిన్నది····

గోవిం —మీరు మరీ అంత కోరుతూంటే కాదనలేక పోతున్నాను (గాత్రం సవరించుకుని) చాలారోజులయిపోయిందండి (అని)

'పేరుధర్మరాజు, పెనువేపవిత్తంద్రు,
మాటతేనెపలుకు మనసు విషము
నేతిబీరకాయ నీయుధిష్ఠిర శబ్దంబు,
ఎరుగనట్టివారికడను పలుకు'

(అని అసహ్యంగా చదువుతాడు.)

గోపా — (చప్పట్లుకొట్టి, ఈలేసి) వన్సుమోర్ ....

మాధ — వూరుకో గోపాలం. ఇది వొట్టి గాత్రం సవిరించుకోడానికి విసిరినరాగం. చాలాబాగుందండి. పద్యమంటే అలాచదవాలి, ఒక్కముక్క ఎవరికీ బోధపడకుండా. అయితేయేం రామకృష్ణగారూ, గయోపాఖ్యానం వేసేద్దాం. అందులో అన్నిపద్యాలూ అందరికీ కంఠతవొచ్చుకనక మనం పద్యం ఎలాచదివినా ఆడియన్సుకి అర్థంకాదన్న బాధుండదు.

రామ — ఏమండీ, మనం ఆదర్శనాటకం వెయ్యాలని బయలు

దేర, గయోపాఖ్యానంలో తేలుతున్నాం. ఈ వరసని ఏంనాటకం వెయ్యగలం ?

నారా — గయోపాఖ్యానం ఎందుకండి. కావలసినన్ని మంచి నాటకాలున్నాయి. క్లాసికల్ డ్రామా కావలిస్తే, శకుంతలనాటక మెయ్యొచ్చు. (రాగయుక్తంగా చతువుతూ) ఈరమణీ లలామ....

మాధ — శకుంతల నెక్కణ్ణుంచి పట్టుకురాగలం ?

నారా — పోనీ హరిశ్చంద్ర వేసుకోవచ్చు. చంద్రమతి మరీ అంతగట్టిమందక్కర్లేదు. " చతురంబోధి . ఈకరమె. "

మాధ — (నారాయణ పద్యం మధ్యలోనే తనోపద్యం అందు కుని చదువుతాడు.) ఇన్స్పిరేషన్ ఆపుకోలేకపోయానండి....బాగా చదివానా ?... గోవిందంగారికంటె నా గాత్రమేబాగుందనుకుంటానే ప్రస్తుతంలో....నారాయణగారు, మనం పద్యాలున్న నాటకమే వెయ్యాలండీ... ఓపద్యంచదవడానికి నాకూ ఛాన్సిప్పిస్తే, మీపక్షమే వోటుచేస్తా .... వొక్కపద్యాలే ఎందుకండీ .... పాటలు మాత్రం వుండొద్దూ. పద్యంకంటె, నే పాట బాగాపాడుతానండోయ్ (హరి ఓబలేశా....అని పాటపాడి) .... నారాయణగారూ, మీకేమన్నా పాటలొచ్చునా?

నారా — ఎందుకు రావు ?

మాధ — కొందరునటకులకి, చెవిగోసినమేకలాగ కుంయ్యో మని రాగంతీస్తూ పద్యంచదవడమేగాని, పాటఅనేసరికి తాళం తప్పేస్తారులెండి.

నారా - మీపాటపాటలు నేనూపాడగలనండీ.... ఆడనేచుక్కాని, ఈడనే గడయేసి....(అని ఓ ఎంకిపాట పాడతాడు.)

గోపా — (రెండోచరణం పాడగానే అందుకుని) ఇహనేం. నాటకం మధ్యలో ఎంకిపాటలు పాడబడును అని అడ్వర్టయిజు చేద్దాం. టిక్కట్లు తెలిగ్గా అమ్మొయ్యొచ్చు.

మాధ — నేనో గొప్పసలహా చెప్పనా ? మనవూరి వ్యవహారా లన్నీ ఓనాటకం రాసుకుందాం. తుమ్మయ్యాని, జగ్గయ్యాని వూళ్ళో పెద్దల్నందర్నీ ఏకేద్దాంపట్టుకుని. గొప్పసోషల్ డ్రామా అయిపో తుంది. అందులో ప్రోజు కావలసినవాళ్ళకి ప్రోజు ; పద్యాలు కావలసినవాళ్ళకి పద్యాలు.

గోపా — [కుర్చీ ముందుకు జరుపుకుని] చాలా గొప్పగా వుంటుంది. స్టేజిమీద తుమ్మయ్యాని తిడదామంటే జగయ్యా, జగ్గయ్యాని తిడదామంటే తుమ్మయ్యా డబ్బిస్తారు. ఒకరికితెలీకుండా రెండోవాళ్ళకి చెప్పి ఇద్దరిదగ్గర్నించీ డబ్బుచ్చుకుని ఇద్దర్నీ తిట్టేదాం. కావసినంతడబ్బు చేసుకోవచ్చు.

[అంటూవుంటే నారాయణ ఎంకిపాటలో మూడోచరణం అందుకుని పాడతాడు. మాధవుడు గోపాల్కూడా పాటలు అందు కుని అల్లరిగా చదువుతారు]

రామ : ఏమిటండి ఈ అల్లరంతా ! [అని గట్టిగా అరుస్తాడు. వర్షంకురిసి వెలిసినట్టుగా ఒక్కమాటు అంతా నిశబ్దం]

గోవిం — అంతా కప్పలతక్కెడ వ్యవహారంగా తయార

యింది. ఇంకోమాటు సావకాశంగా కలుసుకుని తేల్చుకుంటే మంచిది. ఇప్పుడేమీ తెమిలేటట్టులేదు.

మాధ — అయ్యా, ఈమాటు టిఫినూ అదీకూడా ఇక్కడే ఏర్పాటుచేయించండి. మధ్యమధ్య బొగ్గడుతూవుంటేనేకాని నోరాడదు.

నారా — రామకృష్ణగారు నే వెళ్ళొస్తానాని, ఒక్కమాటు ఇలారండి, మీతో కొంచెం ఏకాంతంగా మాట్లాడాలి. (రామకృష్ణుని విడిగా తీసికెళ్ళి) గోవిందాన్నెందుకు పిలిచారండి. అసలు మనం చేసేదేమన్నా బాగుండాలంటే వాడిని దగ్గిరికి చేరనివ్వకూడదు. చాలా గొప్ప యాక్టర్నని వాడికి అహంభావం. ఎవరుచెప్పినమాటా వినడు....ఆ గోపాలంగాడు మరీ వొట్టి ఈంత. ఎక్కడి కెళ్ళినా అందులోంచేదో డబ్బులాగుదా మనుకుంటాడు. వాళ్ళెవ్వరిమాటా వినకండి. మళ్ళీ రేపు నేను ఒంటరిగావచ్చి తీరికగా మాట్లాడు తాను. ఈలోపుగా నాటకంసంగతి మీరుకూడా మళ్ళీ ఆలోచించండి. నాటకంలో పద్యాలూ, అవీ వుండాలి. తెలిసిందా? లేక పోతే నాటకం రాణించదు. పైగా పద్యం తెలుగువాడి స్పెషాలిటీ గోంగూరపచ్చడీ, పెసరట్టులాగ! దాన్ని వొదులుకుంటే ఆంధ్రత్వమే పోతుంది. అనుభవంలేక, కేవలం పుస్తకజ్ఞానంవల్ల, పద్యాలుండకూడ దనుకుంటున్నారు గాని, మీరే ఓమాటు రుచిమరిగారంటేనా?

[ అని పద్యం చదువుకుంటూ వెళిపోతాడు ]

రామ — బాగుంది!

గోపా — నేనుకూడా వెళ్ళొస్తాను....మాట (అని రామకృష్ణని విడిగా తీసికెళ్ళి) మీ బాగుకోరి చెబుతున్నా; మరేమీ అనుకో కండి. మీరు జాగ్రత్తపడకపోతే వీళ్ళందరూ కలిసి, మిమ్మల్ని క్షవరంచేసి పారేస్తారు. నేనూ చెప్పగలను. కబుర్లు, కళారాధన, భోషాణం, లక్ష! ఈ నారాయణగాడికొచ్చిన కళేమిటి చెప్పండి. నాలుగుపద్యాలు పాడతాడు. అంతే. స్టేజీమీదికి ఓమాటు ఎక్కా డంటే, ఆడియన్సంతా లబోమని మొత్తుకుని; వొద్దుబాబూ, మాకునీపాట, దిగిపో, అన్నాగాని మానడు. కళారాధనట, నే వెళ్ళి రానామరి! జాగర్తగా చేసుకుంటే నాటకాల్లోనే లక్షలుగడించొచ్చు....(అంటూ వెళిపోతాడు).

గోవిం — ఏమిటండీ, అంతసేపు మాట్లాడాడు గోపాలం?

రామ — మీసంగతి కాదులెండి.

గోవిం — కాకపోవడమేమిటి? వాడిదగ్గిరో పెద్దరోగముంది లెండి. ఎదుటవాడిని, ఎంతవాడినైనా తూలనాడుతాడు. నాకున్న అనుభవంలో ఓవెయ్యోవంతులేదు. ఎప్పుడూ ఏనాటకంలోను, ఓపెద్ద కారక్టరన్నా వెయ్యలేదు. మహాతెలిసినవాడిలా కబురు చెబుతాడు....పోనీలెండి, వెధవ, వాడేమనుకుంటే నాకేంగాని, కొత్తనాటకాలు వేయిద్దామనుకుంటున్నారుగనక, చెబుతున్నాను. తెలుగులో మంచినాటకాలులేవని, ఈమధ్య నేనే ఓనాటకం రాదా మనుకున్నానండి ఆనాటకం వేస్తేనో?

రామ — నాటకం వ్రాత ప్రారంభించినట్టేనా ?

గోపి — ప్రారంభిద్దా మనుకుంటున్నా, మొదలెడితే ఎంతసేపు లెండి, మొదలెట్టడానికే తీరికలేకుండా వుందిగాని, ఈమధ్య ఐడియా ఏదన్నా చెప్పమని వెంకటశాస్త్రిగారి నడిగాను. చెప్పారు. దానిమీద నాటకం వ్రాయ ప్రారంభించి, కొంత శేషగిరిరావుగారికి చదవి వినిపించాను, ఆయనకి ఆ ఐడియా ఆట్టేనచ్చలేదు. కనక మానుకున్నాను. మళ్ళీ ఏదన్నా మొదలెట్టాలి. మీరేదన్నా ఓ ఐడియా ఇలా పారెయ్యండి వెంటనే రాసేస్తాను. వేసేయ్యొచ్చును.

రామ — భేషుగ్గా వుంది, ఈ కొత్తముష్టి.

గోపిం — నాకు ఐడియాస్‌లేక మిమ్మల్ని అడుగుతున్నా ననుకోకండి, పదిమందికీ నచ్చిన ఐడియాస్ తీసుకుని నాటకం వ్రాస్తే పాప్యులర్‌గా వుంటుందికదా అని. నేవెళ్ళిరానా ! రేపు పెందరాళేవొచ్చి నాటకంవిషయం మాట్లాడుతాను. ఆ గోపాలం గాడినిమాత్రం దగ్గిరికి చేరనివ్వకండి. శలవు. (అని వెళ్ళిపోతాడు.)

రామ — ఒక ఐడియల్ నాటకం వేయించాలని కొన్నినెలలు ప్రయత్నించి ప్రారంభిస్తే, ఏమిటండీ ఇలాతయారయింది.

మాధ — పుటుక్లోనే సంధిగొట్టింది (అని లేచి వెళ్ళిపోతాడు.)

రామ — అంచాకా ఎక్కడ ? నొప్పులు మాయనొప్పులయి పోయాయి.

[తెర]

---

# రిహార్సలు

[హరిశ్చంద్రనాటకం రిహార్సలు ప్రారంభమవబోతోంది. తెరలేవకముందే లోపలినించి మాటలు వినిపిస్తూవుంటాయి. డైరెక్టరుగారి గొంతుక. "రెడీ, రెడీ. ఇంద్రుడిదర్బారు. ఇంద్రుడు. విశ్వామిత్రుడు. వశిష్ఠుడు. వొచ్చి ఈకుర్చీల్లో కూచోండి" తెరలేస్తుంది.]

డై — ఊ. రండి. వశిష్ఠుడు. [వశిష్ఠపాత్రధారి ముందుకొస్తాడు] విశ్వామిత్రుడు. [విశ్వామిత్రపాత్రధారి ముందుకొస్తాడు. తిన్నగా వెళ్ళి కుడివైపునున్న కుర్చీలో కూచుంటాడు] నోనోనో. ఆకుర్చీలోకాదు. ఈకుర్చీలో కూచోండి.

విశ్వా — ఈకుర్చీలో కూచుంటేనేం? మధ్యన ఇంద్రుడు ఓవైపుననేను. రెండోవైపున వశిష్ఠుడు.

డై — That's right. కాని విశ్వామిత్రుడు ఇంద్రుడికి ఎడమవైపున కూచోవాలి. వశిష్ఠుడు కుడివైపున.

విశ్వా — ఎంచేత?

డై — లక్షకారణాలున్నాయి. అవన్నీ తరవాత చెబుతానుగాని ముందరచెప్పినట్టు చెయ్యండి.

విశ్వా — ఎక్కడకూచున్నా కొంపేంమునగదు. ఏదోకూచున్నాను. ఇహలేవలేను. ఇవాళిటికి ఇలాగేకానివ్వండి.

డై — నోనో. రిహార్సలుచేస్తే స్ట్రిక్టుగా చెయ్యాలి. లేకపోతే మానెయ్యాలి. మీరు లేచి ఆకుర్చీమీద కూచోండి.

విశ్వా — అబ్బ. చంపుతున్నారండి. [అని ముక్కుతూ ఎడమవైపునున్న కుర్చీమీద కూచుంటాడు. విశ్వామిత్రుడు కాళీ చేసిన కుర్చీమీద వశిష్ఠుడు కూచుంటాడు].

డై — ఇంద్రుడు....ఇంద్రుడు [ఎవరూ పలకరు]

వశి — రాలేదు.

డై — తొమ్మిదింటికే రిహార్సలుందని తెలీదూ?

వశి — తెలీకేం? తెలిసేవుంటుంది.

డై — తెలిసేవుంటుందేమిటి? తెలుసునా తెలీదా? కబురందిందా?

వశి — అది ఆర్గనైజర్‌గారికే తెలియాలి.

డై — ఏరీ ఆర్గనైజర్‌గారు?

వశి — ఆర్గనైజర్‌గారోయ్! (ఎవరూపలకరు.) ఎక్కడికో కొట్టేసినట్టుంది. ఇప్పుడిక్కడేవుండాలి.

డై — ఇంద్రుడి దర్బారులో ఇంద్రుడు లేకపోతేఎలా?

వశి — వాడి కొస్తే పాట్టులేదులెండి. ఎవరన్నాపదివెయ్యొచ్చు.

డై — నేనాపద్ధతికొప్పుకోను. సీనులోవొచ్చే వాళ్ళందరూ వుంటేనేగాని సీను ప్రారంభించను.

వశి — అయితే పడ్డాయే రిహార్సల్సు.

విశ్వా — ఈ యింద్రుడు వొట్టివెధవండి. వాడికివ్వొద్దు. కామేశ్వర్రావుకివ్వండి ఈపార్టంటే విన్నారుకారు. వాడిసీను రిహార్సలొచ్చేరోజున వాడెప్పుడూ టైముకిరాడు. ఒక్కొక్క

రోజున అసలే ఎగేస్తాడు. వాడి అవసరంలేనినాడు మిగతావాళ్ళ కంటె ఓగంట ముందుగానేవొచ్చి కూచుంటాడు.

దై — అయితే ఎలా? అతన్ని సరిగ్గా టైముకొచ్చేటట్టు చెయ్యాలి.

విశ్వా — వాడిని టైముకొచ్చేటట్టు చేసేవాడు ఈలోకంలో పుట్టలేదింకా.

దై — అలాటివాడికెందుకిచ్చారు పార్టు.

విశ్వా — ఏమో, ఆర్గనైజర్‌గారి నడగండి. నిలవదీసి మరీ అడగండి.

వశి — మళ్ళీ మొదటికొచ్చేంలాభం. అయిందేదో అయిపోయింది. రిహార్సలు మొదలెట్టండి.

దై — ఇంద్రుడివల్ల నాటకమంతా తగలడిపోతుందే.

వశి — ఇంద్రుడేం చెయ్యగలడండి. మొదటిసీనులో తప్ప మళ్ళీరాడు.

దై — మననాటకంలో ప్రతికారెక్టరు, పెర్‌ఫెక్టుగావుండాలి. ఎవరైనా బోకుగాకనిపిస్తే, అతన్ని తీసేసి వెంటనే క్రొత్తవాణ్ణి వేసుకోవాలి.

వశి — ఆసంగతి తరవాత ఆర్గనైజర్‌గారితో ఆలోచించొచ్చు. రిహార్సలు ప్రారంభించండి.

దై — ఇంద్రుడులేకుండా ఈసీను వెయ్యడానికి వీల్లేదు.

రెండోసీసవేద్దాం. [జేబులోనుంచి కాగితంతీసిచూసి]. హరిశ్చం ద్రుడి దర్బారు....హరిశ్చంద్రుడూ ...

హరి — [లోపలనించి తాపీగా ప్రవేశిస్తూ, అందరినీ కలయ జూసి] కాబోలునిది బ్రహ్మరక్షస్సమూహమ్ము....

విశ్వా — మిథ్యాసత్యవాదీ, హరిశ్చంద్రా! నీకళ్ళునెత్తికెక్కి నవా? లేక ఆజ్ఞను ప్రకోపించినదా? ఇచ్చోటి ఉపవిష్టులై యున్నవారు ఋషిసత్తములని తెలియవాకో....

డై — సైలెన్సు. సైలెన్సు.

హరి — [మధ్యఖాళీగావున్న కుర్చీమీదకూచుని వశి॥ తో] Throat Pills తెచ్చిపెట్టావూ?

వశి — అరెరే. మరచిపోయాను. అయినా, ఇప్పుడవి ప్రతి ఇరానీ దుకాణంలో దొరుకుతున్నాయి.

హరి — మీ అఫీసుషావుకో కొంటే, ఓపావలాతక్కువకి గిట్టు తుంది బ్రదర్....

వశి — సకలసామ్రాజ్యమును తృణప్రాయముగనెంచి దాన మీయగలవో హరిశ్చంద్రా కేవలము పావలాడబ్బులకై నీవిట్లు ప్రాకులాడుటతగదు. ముమ్మాటికెని తగదు.

హరి — నీసలహా పాటించుటవలనగదా నారాజ్యమంతయు క్షవరమైనది. ఇకనైనను నీవోడిసలహానిచ్చుట కట్టిబెట్టుము.

డై — (కోపంగా) (సైలెన్సు)

[హరిశ్చంద్రుడు నోటమూసుకుంటాడు. విశ్వామిత్ర వశిష్ఠులు కిక్కురుమనరు. చూడ్డానికివొచ్చిన కొందరుకుర్రాళ్ళు కిలకిలమని నవ్వుతారు. డైరెక్టరు వాళ్ళవేపు తిరిగి 'సైలెన్సు' అని మళ్ళీగట్టిగా కేకేస్తాడు. వాళ్ళుకూడా కిక్కురుమనరు.

డై — (కాగితం చదువుతూ) ఈసీనులో ఇంకాకావలసినవాళ్ళు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, చంద్రమతి, సత్యకీర్తి లోహితాస్యుడు. చంద్రమతి ఏదీ?

వశి — చంద్రమతి వేషం ఓముత్తయిదువుచేతే వేయిద్దామని ప్రయత్నం చేస్తున్నాంలెండి. కుదరకపోతే వెంకన్నగారు వేసేస్తారు.

డై — నోనోనో. ఆడవేషం స్త్రీలే వెయ్యాలి.

వశి — ఒప్పుకున్నాం. మాకూ అదేకావాలి.

డై — లేకపోతే, నాటకం ఏమీరక్తికట్టదు.

విశ్వా — రిహార్సలుమాత్రం రక్తికట్టి ఏడుస్తుందీ? (అని తనలో గొణుక్కుంటూ లేచివెళిపోతాడు).

డై — ఎవరో ఒకర్ని పట్టుకోవాలి. తెలుగువాళ్ళే దొరకాలని నిర్బంధం లేదండీ; మరాఠీ, బెంగాలీ, ఎవరుదొరికినా నేను ట్రయినింగు ఇచ్చి వేయించెయ్యగలను.

వశి — ఆర్గనైజర్‌గారితో చెప్పండి.

డై — సరే, లోహితాస్యుడు?...

హరి — ఇంకాఎవరూ కుదిరినట్టులేదు. కళ్యాణ్‌లో ఓకుఱ్ఱా డున్నాడంటే, చూడ్డానికి వెళ్ళారు Organiser గారు. ఏమ యిందో ఇంకా తెలీదు

డై — అస లేరీ ఈ ఆర్గనైజర్‌గారూ. [వశి: హరి: కూడా ఆర్గనైజర్‌గారోయ్ అని అరుస్తారు]

ఆర్గ — (తెరలోనుంచి) వొస్తున్నానండి. వొస్తున్నా... (లోపలికొచ్చి) ఇంకారిహార్సల్సు మొదలెట్టినట్టులేదే? ఇంత సేపేంచేస్తున్నారు.

డై — ఏ సీనుకీ కావలసిన జనం తిన్నగాలేరయ్యో. ఎవరూ టైముకి రారు. ఇలా అయితే ఎలారిహార్సలు వేసేది?

ఆర్గ — ఎలాగేమిటండీ....అలాగే, ఏదో వేసెయ్యడమే....

డై — అలా అయితే ఎలా?

ఆర్గ — ఎలా అంటే ఎలా?

డై — ఇంతకెయాటిక్‌గావుంటే నే డైరెక్టు చెయ్యలేనండి.

ఆర్గ — మీరు చెయ్యలేకపోడమేమిటండీ. అన్నీ కరెక్టుగా వుంటే ఏఱుంతఅయినా చేస్తాడు. కెయాస్‌లోవున్నా మీరుచేస్తారు. అంచేతేగా మీరు కావాలని కోరితెచ్చుకునేది.

డై — (సంతృప్తిపడి కొంతవరకు) నిజమేననుకోండి. ఇంకో నెల్రోజుల్లో నాటకంపడిపోవాలంటున్నారు. నిజానికి యాభయి రిహార్సళ్ళన్నా పడితేనేగాని నాటకం తిన్నగావెయ్యలేము. యాభయి కాకపోతే ఓయిరవై అయినా వెయ్యాలా?

ఆర్గ — ఓ. తప్పకుండా వెయ్యాలి.

డై — అందేత actors అందరూ టైముకివస్తేనేగాని. కుదరదు.

ఆర్గ — అవును కుదరదు.

డై — Actors అందరికీ గట్టిగా impress చేసి చెప్పండి ఆమాట.

ఆర్గ — మీరు చెప్పెయ్యండి, చాలు.

డై — అలానేకానివ్వండి. (actors ని ఉద్దేశించి) అయ్యా రేపటినించీ తొమ్మిదిగంటలకి రిహార్సలంటే తంగని తొమ్మిది కొట్టేసరికి రిహార్సలు ప్రారంభమయితీరాలిసిందే. అంటే అందరూ పదిపది హేను నిమిషాలు ముందరేవొచ్చి ఇక్కడుండాలి.

ఆర్గ — అవును. వొచ్చి తీరాలి. తెలిసిందా ? (అని హరి.... వైపు చూస్తాడు)

హరి — మాకు చెప్పేంలాభమండీ, ప్రతీరోజూ టైము కొస్తున్నవాళ్ళం. రానివాళ్ళతోచెప్పి తీసుకురండి.

డై — ఆర్గనైజర్ గారూ, ఓనోటీసు పంపించండి.

ఆర్గ — నోటీసెందుకులెండి. నోటితో చెబితేచాలు.

డై — కాదండి. నోటీసువెళ్ళాలి.

ఆర్గ — నోటీసు ఎవరూ చదవరండిబాబూ, కాగితందండగ.

డై — వాళ్ళతో గట్టిగా చెబుదామంటే ఇక్కడికి రారాయె, నోటీసు పంపిస్తే చదవరంటున్నారు. ఇహ ఎలా ?

ఆర్ట — భయం లేదండి. రేపట్నుంచి అందరూ వొస్తారు. ఇవా ళకి వున్నవాళ్ళతో కానిచ్చేసెయ్యండి.

వశి — కానివ్వండి. మొదట్నించీవేద్దాం. ఇంద్రుడిదర్బార్.

హరి — నేపెందరాళేవెళ్ళాలండి. ఎలాగూ మొదలెట్టబోయాం కనక హరిశ్చంద్రుడి దర్బారే కానివ్వండి.

వశి — మానాయనే. ఆలిశ్యంగావొచ్చి, పెందరాళే పోతాట్ట. రిహోర్సలంతా పూర్తయేదాకా ఇక్కణ్ణుంచి కదల కూడదు. తెలిసిందా ?

హరి — నాకుచాలాపనుంది. ఇంటికెళ్ళాలి. పెందరాళేరమ్మని మాఆవిడ చెప్పింది!

వశి — వోయ్. నీ వొక్కడికేకాదోయ్ పెళ్ళామున్నది. అందరిపెళ్ళాలూ, అందరిమొగుళ్ళనీ పెందరాళే రమ్మనేచెప్పి పంపిస్తారు.

హరి — నిజమేననుకో, మా ఆవిడ....

వశి — మీ ఆవిడెక్కడో స్పెషల్‌గా దిగొచ్చిందన్నట్టు మాట్లా డకుమరి. అయ్యా డైరెక్టరుగారూ, మొదట్నించీ ఆరంభిద్దాం. ఇంద్రుడిదర్బారు మొదలెట్టించండి

డై — ఇంద్రుడు లేడుగా

వశి — ఇంద్రుడికోర్టులో ఇంద్రుడెప్పుడూ నామ్‌కేవాస్తే అను కోండి. నేనూ విశ్వామిత్రుడూ వున్నాం చాలు. గ్రంథం నడిపించ డానికి.... (విశ్వామిత్రుడు స్టేజిమీదలేడు) ఏమండోయ్, విశ్వా

మిత్రుడుగారూ, (వున్నవాళ్ళందరూ విశ్వామిత్రుడూ అని తలో రకంగానూ కేకేస్తారు.)

హరి — కుక్క దొరికితే కఱ్ఱదొరకదు. కఱ్ఱదొరికితే కుక్క దొరకదు.

[విశ్వా తాపీగా లోపలికొస్తాడు]

ఆర్గ — మీరిలా షికార్లు కొడుతూవుంటే ఎలాగండి? పిలిచే తప్పటికి వుండొద్దూ?

విశ్వా — ఇక్కడే వున్నాను....

వశి — గొంతుకచించుకుని పావుగంట అరిస్తేనేగాని రాలేదు, ఇక్కడే వున్నాట్ట.

విశ్వా — కొయ్యకు.

ఆర్గ — ఇవ్వటికే లేటయిపోయింది. కానివ్వండి.

విశ్వా — ఏమిటి కానివ్వడం?

ఆ — రిహార్సలు.

వి — ఏ సీను?

వశి — మొదటిది. ఇంద్రుడి దర్బారు.

వి — ఇంద్రుడో?

వశి — అంతఃపురంలో ఎక్కడోచచ్చాడు. టైమయింది కనక దర్బారు మొదలెట్టేస్తున్నాం వాడులేకుండాను.

వి — అసలు వాణ్ణి పీకిపారెస్తే మరీ బాగుంటుంది.

డై — సైలెన్సు. ఇంద్రుడిపార్టు Prompter చదువుతాడు.

రెడీ, Prompter (అందరూ Prompter.... Prompter.... అని అరుస్తారు. ఎవరూరారు.)

వ — ఎవరయ్యా ఈ Prompter ? ఆర్గనైజర్‌గారూ. Prompter ఏడీ.

ఆ — (నసుగుతూ) ప్రాంప్టరూ....

డై — Prompter కూడా హైముకివుండకపోతే ఎలాగండీ ?

డై — Prompter అంటూవేరే ఎవర్నీ ఇంకా నిర్ణయించలేదనుకోండి. ఎవరు కాళీగావుంటే వాళ్లే Prompter చెయ్యొచ్చు.

డై — అదేమిటండీ, నేను లక్షమాట్లు చెప్పాను. ఎవరుబడితే వాడు Prompt చెయ్యడానికి వీల్లేదు. Prompter కి చాలా తరిఫీదు యివ్వాలి. అతను ప్రతిరోజూ రిహార్సలు మొదటి నుంచీ చివరివాకా వుండాలి.

ఆర్గ — పోర్షన్లు ఇవ్వడానికే మనుష్యులు చాలక చస్తూవుంటే Prompter కూడా వేరే ఒకడుకావాలి : వారికే తరిఫీదు యిస్తానంటే ఎలాగండి ?

డై - I am sorry. నాకు చాలావిచారంగా వుంది. లేకపోతే నే డైరెక్టుచెయ్యను.

ఆర్గ — అన్నీ పీకలమీదకి తెస్తారండి మీరు. .... తప్పదంటే ఎవరి కాళ్ళో పట్టుకుంటాలెండి. ఇవ్వాళకి కానివ్వండి.

డై — Prompter అన్నా లేకుండా ఏమిటి కానిచ్చేది ?

ఆర్గ — నేచేస్తాను పదండి.

డై — ఈపద్ధతి నాకేమీ నచ్చదండి.

ఆర్గ — రేపట్నించీ నచ్చేటట్టు చేస్తాంగా ? ఇవాళకి కానివ్వండి [అని పుస్తకం తీసుకుని స్టేజిముందరకొచ్చి] రంకు మొగుడివి దొరికావురా, నువ్వు ఎక్కడోను. (అనికుర్చీలో కూచుంటాడు)

డై — [చాలానిరుత్సాహ పడిపోయాడు] Allright కానివ్వండి. (అని తను రాసుకొచ్చిన నోట్సు చదువుకుంటూ కూచుంటాడు)

ఆర్గ — [పుస్తకం చదువుతూ] ఇంద్రుడిదర్బారు

(వశిష్ఠుడు వెళ్ళి ఎడమ వైపు కుర్చీమీద కూచుంటాడు.)

విశ్వా :- ఓరీ వశిష్ఠుడూ, వెళ్ళి నాఆసనంమీద బైఠాయించావేమిటి ?

వశి :- ఇది నీఆసనమేమిటి? ఎక్కడైనా నీపేరుచెక్కించావా ?.

విశ్వా :- ఇందాకా డైరెక్టరుగారు చెప్పింది అంతావృధా అయిపోయిందీ ? (డై॥ ని ఇమిటేట్ చేస్తూ) విశ్వామిత్రుడు ఇంద్రుడికి ఎడమప్రక్కన కూచోవాలి. వశిష్ఠుడి కుడిప్రక్కన. దీనికి లక్ష కారణాలున్నాయి. ఒక్కకారణం కూడా చెప్పబడదు. లే. (వశిష్ఠుడు లేచి తనుకూర్చున్నకుర్చీ రెండో ప్రక్కవివేసి తనుకూర్చోవలసిన కుర్చీ విశ్వామిత్రుని కిస్తాడు)

వ :- ఆగుమాగుమో వశిష్ఠా. ఇట్లు ఆసనములనేల బదిలీచేయుచుంటివి [డై : ఇప్పటిదాకా తనురాసుకున్న నోట్సు చదువు

కుంటూ ఈసంగతి గుర్తించలేదు. ఇప్పుడు అకస్మాత్తుగా ఈ సంగతి కనిపెట్టి]

దై :- సైలెన్సు .... కూచోండి.

విశ్వా :- సార్. ఈవశిష్ఠుడు నా ఆసనందొబ్బేసి తమవేసుకు కూచున్నాడండి. నాది నాకిప్పించెయ్యండి సార్.

దై :-(సీరియస్‌గా మొహంపెట్టి) ఏకుర్చీ అయితే ఏమిటి, కూచోండి.

విశ్వా :- మీ వలాగలవిస్తే నాకేం అభ్యంతరముంది. కుర్చీలు మార్చకూడదు. ఈఫలాని కుర్చీలోనే కూర్చోవాలి. దానికి లక్ష కారణాలున్నాయి, అంటారేమోనని మీతో ఫిర్యాదు చేసుకున్నాం (కూర్చుని వశి-తో) ఎందుకు కుర్చీమార్చావ్ ?

వశి :- అందులో ఓ మేకు పైకొచ్చి గుచ్చుకుంటోంది.

విశ్వా :- ఎక్కడ ? (అని చేత్తో కుర్చీ అంతా తడుముతాడు మేకు చేతికి గుచ్చుకుంటుంది హారినీ అని కేకేసి) వశిష్ఠా. నీ దెప్పుడూ కుళ్ళు బుద్ధే (కుర్చీలోనుంచి లేచి) నాకుర్చీనాకిచ్చెయ్,

వశి :— నే నివ్వను.

వి — ఇవ్వట్ట (అని మీదకి వెళ్లబోతాడు. వశి॥ కుర్చీతోలేచి పారిపోతాడు. విశ్వామిత్రుడు వెనక తరుముతాడు.)

దై — సైలెన్సు .... సైలెన్సు. ఏమిటీగోల ? (విశ్వా, వశి ఆగిపోతారు)

విశ్వా — నాకుర్చీ నాకిమ్మనండి.

డై — ఏమిటండీ, ఈ గొడవ, చిన్నపిల్లల్లాగ! ఏకుర్చీ అయితే నేం?

విశ్వా — ఈ కుర్చీలో ఓమేకుందండీ .... నాకక్కర్లేదిది.

వశి — [తను కుర్చీని కౌగలించుకొని] నేను అసలివ్వనిది.

డై — లక్షకుర్చీలుంటాయి. ఇంకోకుర్చీ వేసుకోండి.

విశ్వా — తీసుకొచ్చి వేయమనండి.

డై — అయ్యా, ఆర్గనైజర్ గారూ, ఓ కుర్చీ తెప్పించండి.

ఆర్గ — తెప్పించేదేమిటి. నేనేవెళ్ళి తీసుకురావాలి (ముక్కుతూ రెచి ఓ కుర్చీ తీసుకొచ్చివేస్తాడు. విశ్వామిత్రుడు అంతా తడిమి జాగ్రత్తగా కూచుంటాడు.)

డై — రెడీ ....

విశ్వా — వశి : — రెడీ ....

ఆర్గ — (మొదట అందిస్తూ) మునిజన .... మునిజన .... [అంతానిశ్శబ్దం ఎవరూ అందుకోరు. తాను మెల్లిగా చెబితే విని పించడం లేదేమోనని చేతులు Nagaphone లాపెట్టి గట్టిగా] మునిజన ....

వశి — అదిదేవేంద్రుడి పార్టండీ ... మీరే చదివెయ్యండి.

ఆర్గ — ఓ హో .... (చదువుతూ) మునిజన వశిష్ఠా, వశిష్ఠా సత్యవ్రతమును గూర్చి చక్కగా వక్కాణించిరి.

వశి — (గొంతుక సవరించుకొంటూ) ఊ హూ, (మొదట జ్ఞాపకంరాదు. ఆర్గ : Prompt చెయ్యడు) చెప్పండీ ....

ఆర్గ — మీకొచ్చుననుకున్నాను .... సారీ (Prompt చేస్తూ) దేవేంద్రా.

వశి — ఇంకోముక్కకూడా చెప్పండీ .... లేకపోతే జ్ఞాపకం రావటంలేదు.

ఆర్గ — దేవేంద్రా నీపలుకులేల ?

వశి — దేవేంద్రా నీపల్కులేల. సత్యంబు పర .... పర (చిటికవేస్తూ) చెప్పండీ .... మీసొమ్మంతా పోయినట్టు ముక్కలు రేషనింగుచేసి మరీచెబుతారేం ....

డై — అంచేతే Prompt కి మొదటినించీ ట్రెయినింగ్ ఇవ్వాలన్నది.

ఆర్గ — రేపట్నించీ ఒకటి లాక్కొస్తాగా (Prompt చేస్తూ) పరబ్రహ్మ స్వరూపంబుగాన ....

వశి — సత్యంబు పరబ్రహ్మస్వరూపంబుగాన నద్దాన సకల ధర్మంబులు వెలయుచుండు.

ఆర్గ — సకల సత్కర్మలూ ఎగరగొట్టేశారు.

వశి — సారీ .... సకలధర్మంబులు, సకలసత్కర్మలూ వెలయుచుండు. రైట్ ?

ఆర్గ — రైట్.

(వశి — కుర్చీలో మఠంవేసుకు ఈముక్కలుచెబుతాడు)

డై — మీరు అసలునాటకంలో అలాకూచునే చెబుతారా ?

వశి — అంతే ....

డై — అలా కుర్చీలో మఠంవేసుకునే కూచుని చెబుతారా.

వశి — అవ్వే.

డై — మరి ఇవాళ ఎందుకలా చెప్పారు ?

వశి — వూరికేనే ....

డై — రిహార్సల్సు మీరింత లైటుగా తీసుకుంటే ఎలాగ ?

వశి — లైటుగా తీసుకోడం లేదండీ.

డై — అయితే, ఇంద్రుడి దర్బారులో వశిష్ఠుడు అలామఠం వేసుకు కూచుంటాడని మీ ఉదేశమా ?

వశి — లేదండి

డై — మరి ఎందుకలా కూచున్నారు ?

వశి — చెప్పండి. మీ రెలాకూచోమంటే అలానే కూచుంటాను.

డై —(తీక్షణంగా చూస్తూ) కుర్చీలోమామూలుగా కూచున్నట్టు కూచోండి.

వశి — కుర్చీలో నే మామూలుగా మఠంవేసుకునే కూచుంటా నండి .... ఎలాకూచోవాలో మీరోమాటు కూచునిచూపించండి.

డై — కాళ్లు కిందవేళ్లాడేసి కూచోండి.

వశి — అలాచెప్పండి (అని కాళ్లు నిగడదన్ని. కుర్చీలోజారి జేరబడి కూచుంటాడు)

డై — అలామంచంమీద పడుకున్నట్టుకాదు.

వశి — అందుకే మిమ్మల్ని ఒక్కమాటు చూపించమన్నాను.
(డై. దగ్గరకివెళ్ళి వశిష్ఠుకి వీపుమీద చెయ్యేసి, వెన్నెముక నిలబెట్టి, ఠంచ్‌గా కూచోబెడతాడు)

వశి — [ఒక్కక్షణం అలాకూచుని] నడుంపీక్కుపోతోంది ?

డై — నో నో నో. అలానే ఉండాలి. వన్సుమోర్ మళ్లీ చెప్పండి.

వశి — అందించండి Prompter గారూ.

Prompt — దేవేంద్రా ఏపల్కులేల. సత్యంబు పరబ్రహ్మ స్వరూపంబుగాన (గుక్క తిప్పకుండా చదివేస్తాడు.

వశి — ఆగండాగండి, నన్ను చెప్పనియ్యండి. దేవేంద్రా నీపల్కులేల. సత్యంబు పరబ్రహ్మ స్వరూపంబుగాన, నద్దానసకల ధర్మంబులు, సకల సత్కర్మంబులు వెలయుచుండు నద్దాన.

డై — Stop. అలాకొట్టొచ్చినటు చెబుతారేం ? ఇంద్రుడికీ మీకూ ఏమన్నా తగాదావుందా ?

వశి — లేదండి.

డై — మీరెవర్నైనా ఛాలెంజి చేస్తున్నారా ?

వశి — లేదండి.

డై — మీరెందుకు అంతగట్టిగా కుస్తీకి పిలిచినట్టు చెప్పడం ?

వశి — తప్పే.

డై — మీరిప్పుడు వూరికే మీఅభిప్రాయం చెబుతున్నారు. మీరుమాట్లాడేది ఇంద్రుడితో. ఇప్పటిదాకా ఇంకా విశ్వామిత్రు

డితో ఏమీతగాదాలేదు. అంచేత మృదువుగా సున్నితంగాచెప్పాలి అవునా ?

వశి — అవునండి.

డై — నే. చూపిస్తా జాగ్రత్తగా వినండి. మళ్ళీమళ్ళీచెప్పను.

[డై రెకరు ప్రారంభించగానే వి॥ కుర్చీమీదనించి లేచి ఎవరి attention draw చెయ్యకుండా వెళ్ళిపోతాడు. డై॥ పుస్తకం చూసి drawl చేసి చదువుతూ]

దేవేంద్రా నీపల్కులేలా ? సత్యంబు పరబ్రహ్మ స్వరూపంబు గాన, సద్దాన సకల ధర్మంబులూ, సకల సత్కర్మంబులూవెలయు చుండూ....

వశి — (Imitate చేస్తూ ఇంకా draw చేస్తూ పై వాక్యాలు మళ్ళీచదువుతాడు)

డై — మక్కికి మక్కి పాఠం అప్పగించకూడదు, స్పిరిట్ పట్టుకోవాలి.

వశి — ఓ యస్ స్పిరిట్ కేం ? పసికట్టి పట్టేసుకుంటాం.

డై — All right కానివ్వండి.

(ఒక్కక్షణం నిశ్శబ్దం)

వశి — (Prompter. తో) నా పార్టయిపోయింది. తరవాత చెప్పండీ బెల్లంకొట్టిన రాయిలా అలాకూచుంటే ఎలా ?

Prompt — (ఉలిక్కిపడి లేచినట్టు) స్పిరిట్ అంటే బుద్ధి ఎక్కడికో పోయింది.

వశి — కానివ్వండి.

Prompt — బృహస్పతి, బాగు వశిష్ఠా బాగు,

అగస్త్యుడు — వశిష్ఠా, ధర్మే .... ధర్మే .... ఏమిటండీ, ఇది నోరుతిరగని మాటలువేశాడు.

వశి — వాళ్ళెవరూలేరండి మళ్ళీ ఇంద్రుడొచ్చేదాకానే చూసి చెప్పండి.

Prompt — అలాగా (పుస్తకంచూస్తూ) ఈలోపుగా విశ్వామిత్రుడి పోర్షన్ కొంతుందే. అదీకొట్టేశారా ?

వశి — కాదు. కాదు, (గట్టిగా) ఏమండోయ్. విశ్వామిత్రుడుగారు. రండి. మీపార్టొచ్చింది.

విశ్వా — వొచ్చేశా (అంటూ గంతులేసుకొంటూ వచ్చికుర్చీలో కూలబడతాడు)

డై — ఎక్కడికెళ్ళేరండి మీరు ?

విశ్వా — ఎక్కడికీలేదు.

డై — ఇక్కడున్నారా ?

విశ్వా — లేను.

డై — మరి ఎక్కడికీ వెళ్లకండని ఎందుకన్నాను ?

విశ్వా — ఎక్కడికీ అంటే, దూరంగా ఎక్కడికోనని .... కానిద్దురూ.

డై — రిహార్సలు మొదలుపెట్టిన తరువాత మీరలా ఎక్కడికీ వెళ్ళకూడదు,

విశ్వా — రైట్, వెళ్ళం ఇహవించి .... కానివ్వండి.

Prompt — మీరేచెప్పాలి.

విశ్వా — ఏంచెప్పాలో చెప్పండి.

Prompt — వశిష్ఠా ఏల నీనిరర్థక ఉపన్యాసము.

విశ్వా — (వశి॥ వైపు తిరిగి ఉరుముతూ) వశిష్ఠా ఏల నీనిరర్థక ఉపన్యాసము.

డై — నోనో నో నో, అలాకాదు, అలాకాదు మీరు వశిష్ఠుడి వైపే చూడకూడదు, (రెండోవైపు చూపిస్తూ) ఇటు మొహం తిప్పి తేలిగ్గా చిరునవ్వులతో, వశిష్ఠా, ఏల నీ నిరర్థక ఉపన్యాసము. అనాలి.

విశ్వా — విశ్వామిత్రుడు చిరునవ్వుతో మాట్లాడాలంటాదేమిటి, ఈయన ? అగ్గిభరాటా, ఫైరయిపోవాలిగాని,

డై — అదేపొరపాటు విశ్వామిత్రుడి కోపంలో Development చూపించాలి ఈనాటకంలో, అదీటెక్నిక్. విశ్వామిత్రుడు మొదట చిరునవ్వు నవ్వుతూ వుంటాడు. తరవాత కొంచంకోపం, ఆతరవాత మరికొంచెం కోపం, ఆతవాత ఇంకాకోపం ! సీను క్లైమాక్సు కొచ్చేసరికి (act చేస్తూ, అగ్నికణాళ్ళాంటి కళ్లు, తాండవ నృత్యంచెయ్యబోయే శివుడి భీభత్సరూపం రావాలి. మొదట్లోమాత్రం శాంతం, చిరునవ్వు .... ఆ ఈ వశిష్ఠుదేమిటని తృణీకారభావం. డెవలప్మెంటు చూపించాలండీ .... అదీటెక్నిక్. (విశ్వామిత్రుడి

దగ్గిరకివెళ్ళి) మొహం అటుతిప్పండి. (మొహం పూర్తిగా రెండో వైపు తిప్పి) చెప్పం డిప్పుడు.

విశ్వా — ఇటు తిరిగిచెబితే ఎవరికీ వినిపించదండీ .... audience వైపు తిరిగిచెప్పాలి.

డై — ఆసంగతి నేచూచుకొంటానుగా.... మీరటుతిరిగిచెప్పండి.

విశ్వా — వినిపించకపోయిన తరవాత ఇహమీరు చూచుకునేదేమిటండీ.

డై — ఎందుకు వినిపించదండీ audience pindrop Silence maintain చేస్తే ....

విశ్వా — చెయ్యరుగా,

డై — అంతా నే తరవాత చూచుకుంటాను. మీరు నేచెప్పినట్టు చెయ్యండి మొదట.

విశ్వా — Drive కానివ్వండి ఆతమాషాచూద్దాం .... (అని కుర్చీపూర్తిగా రెండో వైపుకి తిప్పేసుకుని, పళ్లుఇకిలిస్తూ) వశిష్ఠా.

డై — నో నో నో కుర్చీ అటు తిప్పెయ్యకూడదు.

విశ్వా — మరి నన్నిలా తిరగమన్నారు ?

డై — కుర్చీలో మామూలుగా కూర్చునే మొహంకొంచెం angle మార్చాలి అంతే. Agnle ఒక్క పిసరు మారేసరికి ఎంత భావమైనా స్ఫురిస్తుంది, ఫిలుములోలాగే నాటకంలోకూడా టెక్నిక్ కావాలండీ, టెక్నిక్.

విశ్వా — నాటకానికి కావలసింది వాచకమండీ, వాచకం. విన పడిచావందే వెధవ angles ఎన్ని చూపిస్తే ఎవడిక్కావాలి.

డై — అబ్బా మీకు చెబితే తెలీదేం ?

విశ్వా — నాకు నాటకం సంగతి చెబుతానంటారేమిటి ? డి. వి. సుబ్బారావు హరిశ్చంద్రలో విశ్వామిత్రుకు వేసే ఆయన దగ్గరనే తరిఫీదు పొందాను. తెలుసా ? నాకుచెబుతున్నారు !

ఆ — వాదాలు పెంచకండి (విశ్వామిత్రుని సంజ్ఞచేసి పిలిచి) రిహార్సలులో వీడు చెప్పినట్టుచెయ్యండి. అసలు నాటకంనాడు వీడు మిమ్మల్ని ఆపగలడా ? మీ ఇష్టమొచ్చినట్టేచేద్దురుగాని. వీడితోవాదం పెట్టుకు కూచుంటే తెలారేదాకా ఇంటికి వెళ్ళలేము. తెలిసిందా ?

విశ్వా — తెలిసిందిగాని వీణ్ణి అసలు పీకిపారెయ్యకూడదు ? వీడెక్కడ దొరికాడు మనకి.

ఆర్గ — అదంతా ఓపెద్ద పొలిటిక్సు. continue రిహార్సల్సు.

విశ్వా — కానివ్వండి. (అనివెళ్ళి కుర్చీమీద కూచుంటాడు. ఆర్గ నైజర్ బయటకి వెళ్ళిపోతాడు. రిహార్సలుమొదలెట్టడానికి అందరూ సిద్ధంగా వుంటారు. హరిశ్చంద్రుడు గబగబ లోపలికొస్తాడు)

హరి — హార్మోనిష్టు వెళ్ళిపోతానంటున్నాడు. నాపద్యాలు practice చేసుకుంటాను. ఇప్పటికి ఈరిహార్సలు ఆపేస్తారూ ?

డై — What nonsense!

హరి — ఇందులో నాన్సెన్సేముందండి లొడలొడ మాట లనేస్తున్నారు,

డై — మీపద్యాలకోసం సీను మధ్యలో రిహార్సలు ఆపెయ్య మనడం నాన్సెన్సుకాదూ ?

హరి — హార్మోనిస్టు [illegible] వెళ్ళిపోవాలి. పదిన్నర దాటితే ట్రెయిన్ లేదు. ఒక్కొక్కసీనే గంటన్నర రిహార్సు చేస్తుంటే అందరూ కూచుంటారా ?

హార్మో — ఇవాళకిపోనీండి. ఎల్లుండి Practice చేసుకుందాం.

హరి — బాగుందండోయ్ ! పద్యాలకి, తిన్నని Practice లేక పోతే నాటకంఅంతా తగలడి పోతుంది. నాటకానికొచ్చేవాళ్ల ఆయన angles చూడ్డానికినికికాదు. నాపద్యాలు వినడానికొస్తారు. హార్మోనియమ్ తెప్పించండి.

డై — మీరిక్కడ మధ్యలో పద్యాలు Practise చెయడానికి వీల్లేదు. ఏమండీ అర్గనైజరుగారూ .... ఏరీ ఈయన ? నిమిష నిమిషానికీ మాయమయిపోతూ వుంటారే ? ఏమండోయ్ అర్గ నైజర్ గారూ (అర్గనైజరుగారు లోపలికొస్తారు)

హరి — విన్నారా ? నేపద్యాలు Practice చేసుకోకూడదట. ఇలాఅయితే నాటకం క్షవరమయిపోతుంది. నేనిప్పుడేచెప్పేస్తున్నా.

డై — రిహార్సలు, సీనుమధ్యలో ఆపేసెయ్యాలిట, ఈయన పద్యాలకోసం.

ఆ — (నవ్వేస్తూ) దీనికింత పెద్దగొడవెందుకు చెప్పండి ? మీరిక్కడ రిహార్సలు చేసుకొంటూవుండండి. అవతల గదిలో పద్యాలు. Practice చేసుకోవచ్చు.

హరి — వో యెస్. నాకేం అభ్యంతరంలేదు (హార్మోనిస్టుతో) ఏమంటారు ?

హార్మో — ఆగదిలో resounding ఏమన్నా ఇస్తుందేమో చూస్తేగాని చెప్పలేను.

ఆ — ఓరోజుకెలాగో సర్దుకుపొండి. రేపన్నీ సరిచేస్తాగా :

హరి — రండిసార్. (అని హార్మోనిస్టూ హరిశ్చంద్రుడూ వెళ్ళిపోతారు)

[ఒక్క క్షణం నిశ్శబ్దం.]

డై — Continue రిహార్సలు.

[మళ్ళీ ఒక్క క్షణం నిశ్శబ్దం]

డై — Prompter....నిద్దరోతున్నారా ఏమిటి ? చెప్పండి.

Prompt—[కాగితాలు తిరగేస్తూ] మీగొడవలో పేజీ తిరగబడిపోయింది. ఎన్నోసీను జరుగుతుందో నాకుతెలీదు.

విశ్వా — ఇంకా మొదటిపేజీలోనే వున్నామండి.

Prompt — That's all. (మొదటిపేజీ చదువుతూ) వశిష్ఠుడు, ఇంద్రుడు, విశ్వామిత్రుడు.

డై — విశ్వామిత్రుడి పార్టేజరుగుతోంది చెప్పండి.

Prompt – Right .... "వశిష్ఠా ఏలనీనిర్ధక" (లోపల నించి హరిశ్చంద్రుడు గబగబ వస్తాడు).

హరి – ఏమండీ, తొక్కుడు హార్మనీ తెప్పించమంటే, చేతి హార్మోనీ తీసుకొచ్చేరేమిటీ?

ఆ – నాటకంనాడు తొక్కుడు హార్మనీ వొస్తుందండీ, దీంతో రిహార్సలు కానివ్వండి.

హరి – అలాకుదరదని మీతోచెప్పాను కాదండి, ఈహార్మోనీ మీద Practice చేస్తే అంతా తగలడి పూరుకుంటుంది. తొక్కుడు హార్మనీమీదే రిహార్సలు జరగాలి.

ఆ – చంపారు.

హరి – No other go వేరేదారిలేదు.

ఆ – అయితే రేపుతెప్పిస్తాను, ఇవ్వాళకి దీనిమీదకానివ్వండి.

హరి – రేపు తెప్పించి తీరాలి సుమండి! (అంటూ వెళ్ళి పోతాడు)

ఆ – చస్తున్నాం ఒక్కొక్కళ్ళ కోర్కెలుతీర్చలేక.

[ఒక్క క్షణం నిశ్శబ్దం]

Prompt – (విశ్వా ....) మీరేనండి .... వశిష్ఠా. ఏలనీ నిరర్థక [ప్రక్కగదిలోనించి బయ్‌మని హార్మోనీస్మృతి వినిపిస్తుంది నౌకరు లోపలికొచ్చి.]

నౌ – హరిశ్చంద్రుడుగారు లోటి పిల్లిమ్మంటున్నారండి.

ఆ — ఏమిటిమ్మంటున్నారు ?

నౌ — లోటిపిల్లండి.

ఆ — అంటే

నౌ — ఏమోనండి.

ఆ — ఆయన్నే రమ్మనిచెప్పు .... (నౌకరు వెళ్ళిపోతాడు) డైరెక్టరుతో) Continue సార్.

డై — మళ్ళీ మధ్యలో interruption ఎందుకు. ఆయనొచ్చి వెళ్ళింతరవాతనే ప్రారంభిద్దాం.

హరి — (లోపలికొస్తూ) వెధవ సర్వెంటుని పెట్టారండి. ఇక్కడ. ఒక్కముక్క తిన్నగా వినడు. అర్థంచేసుకోడు. చస్తున్నాం. వీణ్ణిపీకేసి, మరోణ్ణి పెట్టుకోకూడదూ ?

ఆ — మీ కేంకావాలన్నారు ?

హరి — Throatpills అండీ.

ఆ — నా దగ్గరలేవే ?

హరి — లేకపోతే వెంటనే తెప్పించండి.

ఆ — ఇప్పుడర్ధరాత్రి ఎక్కడ దొరుకుతాయి. రేపు చూద్దాంలెండి

హరి — ఇప్పుడు Practice చేసుకోడానికి కావాలండి. రేపు తెప్పిస్తే ఎలాకుదురుతుంది.

ఆ — అంతకావలసినవారైతే తెచ్చుకునే రాలేకపోయారూ ?

హరి — తొక్కుడు హార్మోనియమ్‌కు అయితే అంతగా అవసరంలేకపోను. చేతిపెట్టి తెప్పించారయ్యో Throatpills వుండితీరాలి.

ఆ — ఎక్కడనుంచి తీసుకురాను ?

హరి — ప్రతికిరాణా దుకాణంలోనూ దొరుకుతున్నాయిట. తొందరగా తెప్పించండి. హార్మోనిష్టుక కైమయిపోతోంది.

అ — అందరూ కొట్టెక్కొకూడునేవాళ్ళే (డబ్బుతీసి నౌకరుకిచ్చి) అదేదో కాగితంమీద రాసి యిచ్చి పంపించండి, లేకపోతే ఏపిల్లో కుక్కో కావాలంటాడుమళ్ళీ.

హరి — (కాగితంమీద వ్రాసి నౌకరు కిచ్చి) పరిగెత్తుకుంటూరావాలి. తెలిసిందా ? పరుగెత్తు ! ఊ పరుగెత్తు.

[నౌకరు వెళ్ళిపోతాడు వెనకాలే హరిశ్చంద్రుడు కూడావెళతాడు]

Prompt — Continue rehearsal వశిష్ఠా! ఏలనీనిరర్థక (ఎవరూ అందుకోరు వశిష్ఠుడు కునికిపాట్లుపడుతున్నాడు. విశ్వామిత్రుడు గుర్లుమిటకరిస్తూ కూచున్నాడు. Prompter మళ్ళీ చాలాగట్టిగా " వశిష్టా ఏలనీనిరర్థక " దాంతోవశిష్ఠుడులేచిపోయి)

వశి — ఏలనీనిరర్థక.

Prompt — మీదికాదు. అదివిశ్వామిత్రుడి పార్టు.

వశి — I am sary వశిష్ఠా అంటే నాపార్టేమో అనుకున్నా.

Prompt — అది వశిష్ఠుడిని పిలిచి చెప్పడం.

డై — మీరు రిహార్సలు మధ్యలో నిద్దరకూడాపోతేఎలాగ? నాటకంలోకూడా నిద్దరపోతారా?

వశి — అబ్బెబ్బే!

డై — మరి ఈవాళ ఎందుకు పోయారు? (అని గట్టిగా దబా యిస్తాడు)

వశి — లేటయిపోయి కునికిపాట్లు వొచ్చేశాయి. త్వరత్వరగా తెముల్చుకు పోదాంపదండి ... (Prompter—తో) మెస్సార్ చెప్పండి నాపార్టు.

Prompt — నా ఉపన్యాసంబు నిరర్థకమా?

వశి — (గుండెకొట్టుకుని ఉరుముతూ) నా ఉపన్యాసంబు నిరర్థకమా?

[వెనకనుంచి పద్యం వినిపిస్తుంది. హరిశ్చంద్రుడి Practice ప్రారంభమయింది]

కాటి సుంకంబు చెల్లింపకయె శవాల
మననమున కాల్పరే కద మనుజులార
కాపు లేదను కొంటిరేమొ, నడుందు
దళిత ఘోరారి యీవీరదాసు గలడు.

డై — వెనకాల్నించి అలాపద్యాలు పాడుతూవుంటే ఇక్కడ రిహార్సలెలా సాగుతుందండి?

వశి — ఆర్గనైజర్ గారూ, వెళ్ళి హరిశ్చంద్రుడుగార్ని పద్యాలు కట్టిపెట్ట మనండి.

[వెనకనుంచి మళ్ళీపద్యం]

పడతీ ఎవ్వతె వీవు, ఠాలుగరగన్ వాపోవు చున్నావు నీ
కొడుకెద్దాన గతించె, నెవ్వరును నీకుం జుట్టముల్లేరె, యీ
నడరే యొంటిగ నెట్లువచ్చితి శ్మశానక్షోణికిన్ చిత్రమ
య్యెడునీరీతి వచింపు మేడ్చిఫలమేమీ యూరటంబొందుమీ.

[చివరబాకారాగం తీస్తాడు]

డై — నో నో నో పద్యం చదవడం అలాకాదే (అనిలోపలికి పరిగెడతాడు)

వశీ — ఈయన పద్యాలుకూడా డైరెకు చేస్తానంటాడాఏమిటి ?

విశ్వా — ఓ .... Angles లో పద్యాలుచదివిస్తాడు.

[లోపలినించి డైరెక్టరూ హరిశ్చంద్రుడూ ఘర్షణపడుకొంటూ వొస్తారు]

డై — పద్యం చివర మీరంతరాగం తియ్యకూడదు.

హరి — మధ్యలో తీస్తే పద్యం తగలడిపోదూ.

డై — మధ్యనూ తియ్యకూడదు. భావయుక్తంగా చదివివూరు కోవాలి నేనోమాటు అపద్యాలన్నీ ఎలాచదవాలో చూపించిన తర వాతే మీరు Practice చెయ్యండి లేకపోతే తప్పులు వొంటబట్టి పోతాయి.

హరి — [Shock అయినటు] పద్య మెలా చదవాలో నాకు నేర్పుతానంటాడేమిటి ఈయన ?

డై — పద్యమంటే గంయ్ గంయ్ మని రాగంతియ్యడంకాదు.

హరి — వోయ్, ఇవన్నీ మాకు తెలుసునండీ నాపద్యాల విషయమై మీరేం బాధపడొద్దు. నేనూ హార్మోనిష్టుగారూ తంటాలు పడుకుంటాం.

డై — మీయిష్టమొచ్చినట్లు పాటకచేరీ చేస్తామంటే పదరదు.

హరి — అయ్యా డైరెక్టరుగారూ, Prose మీ యిష్టమొచ్చినట్లు డైరెక్టు చేసుకోండి. పద్యాలజోలికి మాత్రం రాకండి తెలిసిందా ?

డై — అదేం నాదగ్గరసాగదు. Prose, పద్యాలు, చివరికి ప్రతి movement కూడా నే డైరెక్టు చేసినట్టు వుండాలి.

హరి — అయితే నాటకంపడిందే,

డై — మాచక్కగా పడుతుంది. నాటకంలో అద్భుతమైన టెక్నిక్ చూస్తాపినుకాదండీ, టెక్నిక్.

[ హరిశ్చంద్రుడేదో జవాబు చెప్పడానికి నోరెత్తుతాడు గాని హార్మోనిస్టు గబగబ లోపలికొచ్చి ]

హా — నే వెళ్ళిపోనా ?

హరి — వొద్దొద్దు. నేవొస్తున్నా. (అర్గ॥ తో) పద్యాలజోలికి రావద్దని ఆయనకి గట్టిగాచెప్పండి. తెలిసిందా, రసాభాసయి పోతుంది లేకపోతే (అనివెళ్ళిపోతాడు.)

డై — ఈయనలాటి సంగీతనటకుల్ని నే చాలామందిని చూశాం. వీళ్ళతోక తెంచడం నాకు తెలుసుగా !

ఆ — రిహార్సలు కానివ్వండి, మొదట, Prompter....

Prompt — వశిష్ఠుడు .... నా ఉపన్యా ....

వశి — (ఆవలిస్తూ) చెప్పేశానది ఇదివరకు.

Prompt — మళ్ళీ చెప్పండి.

వశి —[పెద్దగా ఆవలిస్తూ] ఆర్గనైజర్ గారూ, మా చెడ్డ నిద్ర కొస్తోంది. టీ తెప్పించండి.

విశ్వా — నాకు కాఫీ తెప్పించండి.

Prompt — ఓ Packet సిగరెట్లు కూడా తెప్పించండి. Gold Flake

[వెనకనుంచి పద్యం]

జవదాటి యెరుగదీ యువతీలలామంబు
పతిమాట రతనాల పైడిమూట
అడుగు దప్పి యెరుంగ దత్తమామల యాజ్ఞ
కనమాన భక్తి దివ్యాను రక్తి
అణుమాత్రమైన బొంకనుమాట యెరుగదీ
కలుష విహీన నన్యులకునైన
కోపంబెరుగదీ గుణవితాన నితాంత
యొరులెంత తనుదూరు తున్న నుంత

శీలతాంగి సమస్త భూపాలమకుట
భవ్యమణి కాంత కబలితపాదుడైన
సార్వభౌముని శ్రీహరిశ్చంద్రుభార్య
దాసిగా నీపె గొనరయ్య, ధన్యులార.

Prompt — తగలేశాడు. అంతకన్న నే భాగాపాడుతాను.

వశి — వాడంతేలెండి. ఎన్నిసంవత్సరాలు పాడినా, వాడికి శ్రుతి అయినా తిన్నగా కలవదు. (ఆవలించి) అయ్యా, అర్గ నైజయగారూ, టీ చెప్పారు కాదు.

అర్గ — నౌకరు రాగానే తెప్పిస్తా.

[హరిశ్చంద్రుడు రొంవరగా లోపలికొ సాడు]

హరి — అర్గనైజరుగారూ. Harmonist గారికి ట్రన్‌టయి మయిపోతోంది. స్టేషన్‌దగ్గిర దిగబెట్టియ్యడానికి ఓ Taxi తెప్పిస్తారా? పెందరాళే ఇంటికి వొచ్చేస్తానని మాఆవిడకి Promise చేశాను. ఆ Taxi లో నేనూ యింటికి పోవొచ్చు [అని సమాధానం వినకుండా వెళ్ళిపోతాడు.]

అర్గ — Taxi చాలా, ఏరోప్లేన్ తెప్పించ మంటారా! [కొంచెం విసుగుతో] కానివ్వండి సార్ రిహార్సలు.

Prompt — వశిష్ఠుడు. నాఉపన్యాసము నిరర్థకమా?

వశి — (ఆవలిస్తూ) మళ్ళీ ఎన్నిమాట్లండీ.

Prompt — కి Word చెప్పొద్దూ.

వశి — (గుండె కొట్టుకుంటూ) నా ఉపన్యాసంబు నిరర్థకమా ?

విశ్వా — బ్రాహ్మణాధమా, వశిష్ఠా అవును, ముమ్మాటికిని అవును. (Prompter కి ఆమాట పుస్తకంలో కనిపించదు. పుస్తకం వెతుకుతూ)

Prompter — ఇదెక్కడుందండీ విశ్వామిత్రుడుగారూ .... పుస్తకంలోలేదే ....

విశ్వా — అది పుస్తకంలో లేదు లెండి. నేనువేరే స్వయంగా రాశాను.

డై — ఎందుకూ ?

విశ్వా — నాటకం రక్తికట్టించ డానికి. Progressive గా చెయ్యడానికి.

డై — ఎలాగ ?

విశ్వా — (Act చేస్తూ హీనస్వరంతో) అవును, వశిష్ఠా, ముమ్మాటికి నిజము. అనడములోనూ (తీవిగా) బ్రాహ్మణాధమా, వశిషా అవును ముమ్మాటికీ అవును. అనడంలోనూ తేడాలేదు. నే రాసింది రక్తికట్టదూ ?

వశి — Progress మాటేమిటి ?

విశ్వా — బ్రాహ్మల్నితిడితే Progress కాదుట్రా.

వశి — భేషుగ్గావుందిరా Progress.

డై — ఇదొక్కటేనా. ఇంకా సొంతంగా రాసిన వున్నాయా ?

విశ్వా — అవసరమనితోచిన ప్రతిచోటా సొంతంగా వ్రాసాను

డై — ఎవరిచ్చారు మీకా అధికారం ?

విశ్వా — ఒకడిచ్చేదేమిటి? As an experienced actor, నాకు తెలుసుగా. ఎక్కడ ఏముక్క వేస్తే రక్తి కడుతుందో వేశాను.

డై — (అర్గ॥తో) Rubbish ఎవడికి తోచినముక్కలువాడు చేర్చేసుకొంటే ఎలా ? నే టాలరేట్ చెయ్యను.

విశ్వా — ఏమండోయ్. డైరెక్టరుగారూ, మాటలు ఆలోచించి మరీరానివ్వండి. ఏదోకుఱ్ఱాళ్ళమీద సవారీ చేసినట్టు నామీద చేదామంటే, నేను Tolorate చేసేదిలేదు. తెలిసిందా : Experienced actor ని.

డై — (అర్గ .... తో) ఈటోన్‌లో మాట్లాడేవాళ్ళని నే అసలు Tolerate చెయ్యనండి. నో నో నో ఈయన్ని తీసేసి మరో విశ్వామిత్రుణ్ణి చూడండి.

విశ్వా — (స్టేజి రెండోపక్కకెళ్ళి) కుఱ్ఱాళ్ళని దబాయించడమనుకున్నాడు. వీడిశార్ధం. Angles ట, angles. నరుకుతాను నాతో అట్టే interfere అయితే.

ఆర్గ — (డైర॥ తో) మీరు తొందరపడకండి. నే నతన్ని రేపు దార్లోకి తీసుకొస్తాను.

డై — అడుగడుక్కీ పేచీ తెస్తుంటే.

ఆ — మీకెందుకు. నే అన్నీసర్దేస్తాగా రేపు. ఇవాళకి రిహా ర్సను తెమిల్చెయ్యండి. త్వరగా.

విశ్వా — అయ్యా. అర్గనైజర్‌గారూ, ఓమాటిలా రండి. (ఆ॥ వెళతాడు) నేను నాపార్టుకి రాసుకున్నముక్క ఒక్కటి (డైరెక్టర్కు చూపిస్తూ) ఆయనముట్టుకోడానికివీల్లేదు. తెలిసిందా?

ఆ — తగాదా పెంచకండి!

విశ్వా — నేను Experienced Actor ని. ఎక్కడేంపడాలో నాకుతెలుసు. ఆంగిక్కు గేంగిక్కు, నామీద అట్టే ప్రయోగించొద్దని చెప్పండి.

ఆ— వూరుకోండీ .... రేపాయన్ని దార్లోకి తీసుకొస్తాను.

విశ్వా — ఆ : గట్టిగానే warn చెయ్యండి. లేకపోతే డైరెక్టర్ గిరీ ఎగిరిపోతుంది.

ఆ — [విశ్వామిత్రుడి చెయ్యిపట్టుకుని] బాబ్బాబు, వూరుకో. [అనిచెవులో ఏదోచెబుతూ వుంటాడు. Prompter లేచి సిగ రెట్లు తెప్పించారుకారు Organiser గారు" అనిగొణుక్కుంటూ పైకి పోతాడు. వశిష్ఠుడు, కాళ్ళు నిగడదన్ని కళ్ళుమూసుకుంటాడు అంతకిమునుపే]

డై — అయ్యా. అర్గనైజరుగారూ, గుసగుసలేమీ నాకు పనికి రావు తెలిసిందా? డైరెక్టరు చెప్పినట్లు ఆక్టర్లు వింటేనే విన్నారు. లేకపోతే నేవూరుకోను.

విశ్వా — [పక్కకి తిరిగి] పూసకోకపోతే పుట్టెట్టుకోమను.

డై — ఈ విశ్వామిత్రుడిలాంటి వాళ్ళున్నారే, వీళ్ళు నాటకానికి చేటపుట్టులు. నాటక ప్రపంచానికి పట్టుకున్న చెద. అది దులపుతేనే గాని నాటకాలు బాగుపడవు.

విశ్వా — [డై॥ కి అభిముఖంగా తిరిగి] డైరెక్టర్లు నాటకాన్ని పట్టుకున్న దెయ్యాలూ, భూతాలూను. ఐడితపూజచేసి వాడల గొడితేనేగాని బాగుపడవు.

డై — మాటలు తిన్నగా రావ్వండి.

విశ్వా — మాటలు తిన్నగా రానివ్వండి.

డై — Shutup.

విశ్వా — You first Shut up.

[అని ఒకళ్ళమీదకి ఒకళ్ళు ఉరకబోయినట్టు నించుంటారు. ఒలిక్కిపడి. వశిష్టుడు లేచి విశ్వా॥ గట్టిగా పట్టుకుంటాడు, ఆర్గనైజర్ డై॥ని పటుకుంటాడు. నౌకరుగబగబా లోపలికొస్తాడు]

నౌ — త్రోటిపిల్లులు తెచ్చానండి. ఎవరికిమ్మంటారు?

[తెర]

---

# ప్రదర్శనం

[తెరతీసేసరికి వశిష్ఠ పాత్రధారి తనపాత్ర కాగితాలు పుచ్చుకుని అటూయిటూ పచార్లుచేస్తూవుంటాడు. కాషాయ వస్త్రాలతో, మునివేషంలోవుంటాడు. ఆయనకి పాత్ర కంఠతారాదు. అందుచేత మననం చేసుకోవాలని ప్రయత్నం.]

వశి — [చదువుతూ] అద్దాని ప్రభావంబుననే పరమేశ్వరుండు, జంగమస్థావర విశిష్టంబైన భువనంబుల సృష్టింపను, పెంపను, హరియింపను, సమర్థుడయ్యె. వెండియు వికల్ప శూన్యంబైన యమ్మహామహిమ సంకల్పంబదియె కాన .... [పుస్తకం మూసేసి చదవడానికి ప్రయత్నిస్తూ] అద్దాని ప్రభావంబుననే [బుర్ర గోక్కుంటూ] వెధవప్రోజుముక్కల్తో ఇదేగొడవ. ఎంతకీ కంఠతా రావు. పద్యమయితే, మొదలందిస్తే, చివరిదాకా దంచుకుపోవొచ్చు. [మళ్ళీ చదువుతూ] వెండియు వికల్ప శూన్యంబైన యమ్మహామహిమ సంకల్పంబదియె కాన [హార్మోనియమ్ అందుకునే వాడి పోజులో ఒక్కక్షణం ఊరుకుని పద్యం పాడతాడు]

సత్యంబే సకలార్థ సాధకమగున్, సత్యస్థిరుండౌను నా
న్నత్యం బెల్లెడలందు, సత్యమునకన్నన్ మిన్నయౌ ధర్మముల్
స్తుత్యంబుల్ మరిలేవు, సత్యమె ఫలించున్ నాటికిన్ నేటికిన్
సత్యాలాపి యొకండె నిత్యుడు, ప్రపంచస్థాయి సత్యంబగున్.

[హరిశ్చంద్ర పాత్రధారి లోపలినించి కోపంతోవాస్తూ]

హరి — Nonsense; లక్షమాట్లు మరీ మరీ చెప్పాను.

ఆర్గనైజర్ — (వెనకాలే వాస్తూ కొంచెం apologetic గా) దొరకలేదు. ఏంచెయ్యమంటారు ?

హరి — దొరక్కపోవడమేమిటండి ? ఈవూళ్ళోమాక్సుఫాక్టర్ 'డిపో' యేవుంటే.

ఆర్గ — దొరకలేదంటే, అసలు దొరకదని కాదండీ. చాలా ఖరీదు !

హరి — ఖర్చులేకుండా నాటకం పడాలంటే ఎలా కుదురుతుంది ? అందులో పౌరాణిక డ్రామా ! డ్రెస్సూ, మేకప్ సరిగ్గాలేకపోతే, నాటకం ఏడిసినట్టుంటుంది.

ఆర్గ — మేకప్‌కి ఏమీ లోటురాదు. అతను చాలా చక్కగా చేస్తాడు. మీరు వెళ్ళి వేయించుకోండి.

హరి — ఈ వెధవకేకుల్తో వేస్తే మొహమంతా ఇలా (మొహంమీద అరిచేత్తో బాదుకుంటూ) టపటపమని బాదించుకోవాలండీ. Maxfactor అయితే, నిముషంలో అద్భుతంగా తయారయిపోతుంది.

ఆ — నిజమేననుకోండి, ఫాషనబుల్ లేడీసందరూ, రోజూ ఉపయోగానికి కొనేసుకోవడంవల్ల, డిమాండ్ హెచ్చిపోయి, బ్లాక్

మార్కెట్‌లోగాని అది దొరకడంలేదు స్వామీ .... టైము లేదు .... పదండి.

హరి — నోనో. నే నా కోటా కొట్టించుకోను. Maxfactor తెప్పించండి.

ఆ — ఎనిమిదిన్నర అయిపోయింది. వూరంతా గాలించినా దొరకదు. తొమ్మిదింటికి తెర లేవాలి.

హరి — నేను గంటకిందటే చెప్పాను. అవునా, కాదా ?

ఆ — చెప్పారు. కాని Maxfactor అక్కర్లేకుండా అద్భుతంగా వేస్తానని మేకప్‌మాన్ చెప్పాడు.

హరి — వాడి శార్ధం. మాడిపోయేది వాడి మొహమా నా మొహమా ? నే నొప్పుకోను.

అ — మీరలా అంటే చచ్చిపోతాం. బాబ్బాబు, ఇవాళకెలాగో కానిచ్చేసెయ్యండి [అని గడ్డం పట్టుకుంటాడు]

హరి — ఎలాగో కానిచ్చే సెయ్యడమేమిటండీ, ప్రతిదానికీని. మొదలెట్టేటప్పుడేమో ఆదర్శప్రాయంగా వెయ్యాలనడం. తీరా క్రియకి దిగేసరికి, ఎలాగో కానిచ్చేసెయ్యండీ, అనడం. అందుకే అమెచ్యూర్ నాటకాలన్నీ అలా ఏడుస్తున్నాయి.

ఆ — ప్రొఫెషనల్ నాటకాలు అంతకంటె బాగుండి ఏడిశాయి కనకనా .... ఆ గొడవలకేంగాని .... ప్లీజ్ .... ఇవాళిటికి తయారయిపోరూ !

హరి — ఛీ ఛీ. అమెచ్యూర్ నాటకాల్లో వేషమెయ్యడమంటే అసహ్యం పుట్టేస్తోంది. (అని చీదరించుకుంటూలోపలికి వెళ్ళి పోతాడు.)

ఆ — నాటకం వేయించడమంటేనే అసహ్యం పుట్టేస్తోంది నాకు [అని పైకి వెళ్ళిపోబోతూవుంటే]

వశి — ఏమండీ. ఆర్గనైజర్ గారూ, నాకు పావుకోళ్ళు ఎక్కడా కనిపించలేదండీ. వెతికి ఇప్పిస్తారూ ?

ఆ — పావుకోళ్లు కావాలా ఏమిటి ?

వశి — ఋషిసత్తములకి పావుకోళ్లు అక్కర్లేదండీ మరి! పైగా ఏ అరణ్యంలోనో ముక్కుమూసుకుని తపస్సుచేసే ఋషినికాడు. సురసభలో, సత్యహరిశ్చంద్రుడి దర్బారులో మన్నన లందుకునే ఋషిపుంగవుణ్ణి.

ఆ — మీపావుకోళ్లు లిస్టులో వున్నాయా ?

వశి — వుండేవుంటాయండి. డైరెక్టరుగారు చెప్పారు, పావుకోళ్లు వుండి తీరాలవి.

ఆ — అయితే వొచ్చేవుంటాయి.

వశి — కొంచెం త్వరగా చూసి పంపించండి. పావుకోళ్ళతో నడవడం, రిహార్సల్సు వేసుకుని అలవాటుచేసుకుంటేగాని, అదేం,

అభాసవుతుందో. అలా ఎందుకు నడిచావు ; ఇంత చప్పుడెందుకు చేశావు, అని డైరెక్టరుగారు నాప్రాణం తీస్తారు లేకపోతే.

ఆ — చూసి పంపించేస్తాను [అని లోపలికి వెళ్ళిపోతూవుంటే డైరెక్టర్‌గారు లోపలికొస్తాడు]

డై — ఏమండీ, ఆర్గనైజర్‌గారూ, ఇంకా ఒక్కడైనా తిన్నగా తయారు కాలేదు, తొమ్మిదింటికి ప్రారంభించేసెయ్యాలి, ఎలా ?

ఆ — నేనేం చెయ్యను ! ఎప్పుడు తయారయితే, అప్పుడే ప్రారంభిద్దాం.

డై — అలా కుదరదండోయ్. టంగని తొమ్మిది కొడుతూ వుంటే తెర లేవాలి.

ఆ — ఎవరూ తయారవనికాడికి తెర లేచేం ప్రయోజనం !

డై — వెళ్ళి మీరందర్నీ తయారు చేయించేసెయ్యండి.

ఆ — ఆ హరిశ్చంద్రుడుగాడు ఇప్పు డెళ్ళాడు. నే ఎంత తొందరచేస్తే మాత్రం ఏంప్రయోజనం ?

వః — హరిశ్చంద్రుడు రెండోసీనులోకాని రాడండి. మొదటి సీనులో వొచ్చేవాళ్ళందరూ తయారయిపోతే, తెరెత్తెయ్యవచ్చు. అది అయేలోపుగా మిగతావాళ్లు తయారవుతారు.

డై — Absurd. అందరూ తయారవుతేనేగాని, తెర తియ్యడానికి వీల్లేదు. ఇంకో పదినిమిషాల్లో అందరూ తయారయి పోయేటట్టు చూడండి.

ఆ — అరగంటలో తయారయితే, పదినిమిషాల్లో అయినంత ఫలం [అని లోపలికి వెళ్ళబోతాడు]

వశి — ఏమండీ, సోడాలొచ్చాయా? ఒకటికొట్టి, కుర్రాణ్ణి ఇలా తీసుకు రమ్మంటారూ?

ఆ — ఇప్పటినించీ సోడాలు తాగడం ప్రారంభిస్తే, తెచ్చినవి ఆగవు.

వశి — అయితే మళ్లీ తెప్పించండి. అంతేగాని గొంతుకు ఆరిపోతూవుంటే సోడానీళ్లయినా పొయ్యనంటే ఎలాగండీ? మొదటి సీనులోనే రెండు మూడు పద్యాలుకూడా వున్నాయి.

ఆ — (విసుక్కుంటూ) పంపిస్తాలెండి.

వశి — ఆయన సొమ్మయినట్టు బాధపడుతాడేం. ఆయన మాత్రం రెండుకి తక్కువగా ఎప్పుడూ తాగడు!

[డైరెక్టరు ఇదేమీ వినిపించుకోకుండా, మొదటి సీను ఏ విధంగా అరేంజిచేస్తే బాగుంటుందో చూసుకుంటూ వుంటాడు. మధ్యమధ్య చేతిలో లిస్టు చూసుకుని, "ఇక్కడ కుర్చీ....ఇక్కడ టీపాయ్....దానికి కుడివైపున తొమ్మిదిన్నర అంగుళాల్లో రెండు కుర్చీలు....ఈ మూల చిన్నబల్ల....దాని మీద పూలగుచ్ఛము" అంటాడు.]

వశి — [పార్టు చదువుతూ] నీ కర్మంబు నీ వనుభవింపక తీరదు .... నీ కర్మంబు .... నీ కర్మంబు .... అనుభవింపక ....

అనుభవింపక .... తీరదు .... తీరదు. నీ కర్మంబు నీ వనుభవింపక ....

దై — [అకస్మాత్తుగా మీదకి తిరిగి ఉరుముతూ] ఎన్నిమాట్లు చెప్పానండీ మీకు, ఇలా కంఠతా పట్టకూడదని.

వశీ — [చేతిలోనించి కాగితాలు జారి కిందపడతాయి] నాకు.... నాకు ....

దై — పూర్తి వాక్యమంతా కంఠతాపట్టాలిగాని, దొంగ ఇంపోజిషన్ వ్రాసినట్టు అలా సగం సగం తుంచి చదవొద్దండీ అని చెప్పలేదూ ?

వశీ — చెప్పారు ....

దై — ఎన్నిమాట్లుచెప్పినా మళ్ళీ అదే తప్పుచేస్తూవుంటే ఎలా?

వశీ — తప్పే....

దై — పరీక్షకి ముక్కున పెట్టుకువెళ్ళినట్లు ఆఖరినిమిషందాకా చదవొద్దు. డ్రెస్ వేసుకున్న తరువాత, ఒక మూలకూచుని mood లోకి రండి అనికూడా చెప్పానా లేదా ?

వశీ — చెప్పారండి.

దై — మరి ?

వశీ — కూచుని చూశానుగాని, ఏమూల కూచున్నా గాలిరాక ఉక్కిరి బిక్కిరయిపోతూవుంటే ఇక్కడకొచ్చాను. ఇక్కడే

ఏమీ పదవకుండా కూచుంటా లెండి. [అని ఒక కుర్చీతెచ్చుకుని స్టేజిమధ్యలో వేసుకు కూచుంటాడు]

వై — వారికి అడ్డుగా కూచోకండి. ఇక్కడేసుకోండి [అని ఒకపక్కగా చూపిస్తాడు, వశిష్ఠుడు కుర్చీ అక్కడేసుకు కూచుంటాడు]

[డైరెక్టరు జేబులోనించి చేపుతీసి, ముద్దముక్కతో మాత్రు పెట్టుకుంటూ బయటికి వెళ్ళిపోతాడు. ఆర్గనైజర్ లోపలికొస్తాడు]

వశి — ఏమండీ, సోడా పంపించారుకారు, నోరెండిపోతోంది.

ఆ — నౌకరు కుఱ్ఱాడు కనిపించడంలేదు. మీరే లోపలికెళ్ళి తాగేసి రాకూడదూ?

వశి — నన్నిక్కడినించి కదలొద్దన్నారండి డైరెక్టర్‌గారు. నే mood లోకి రావాలిట! సోడా ఇక్కడికే పంపించెయ్యండి.

ఆ — అలాగే.

వశి — పావుకోళ్ళదారికాయా....

ఆ — ఇంకా చూళ్ళేదండి .... తెచ్చిన వస్తువులన్నీ అక్కడ బుట్టలోనేవున్నాయి. ఒక్కమాటు మీరెళ్ళి చూసుకోకూడదూ?

వశి — చెప్పానుగా నాకు mood రావడంగురించి!

ఆ — బాగానేవున్నాయి మీ moods. ఆ హరిశ్చంద్రుడుగాణ్ణి సవరదీసి కూచోపెట్టేసరికి తలప్రాణం తోక్కొచ్చింది.

వశి — వాడువొట్టి జోకులెండి. వూరుకున్నకొద్దీ మీదెక్కు-తాడు అంచేతే, హరిశ్చంద్రుడు నాచేత వేయించండీ అంటే మీరు విన్నారా? ఆమాత్రం నేపాడనూ....

ఆ — మళ్ళీ తప్పకండి ఆగొడవలన్నీ (అని లోపలికి వెళ్ళి పోజోతూవుంటాడు).

వశి — ఆసోడా త్వరగా రప్పించండి. [ఆర్గనైజర్ వెళ్ళిపోతాడు. వశిష్ఠుడు మళ్ళీపాఠం చదువుతూ] దేవేంద్రా, నీవడిగిన ప్రశ్నంబు నకు నేను దైవసాక్షిగా నుత్తరంబిచ్చెద. దేవేంద్రా....

[అంటూవుంటే దేవేంద్ర పాత్రధారి లోపలికొస్తాడు. అతని వేషం పూర్తయింది. చెమ్కీకోటు అతనికి పెద్దదయింది. చేతులు వేళ్లాడుతున్నాయి. సిగరెట్టు కాలుస్తూవుంటాడు]

వశి — అంతపొడుగు చేతులకోటు ధరించితివేల, దేవేంద్రా?

దేవేం — నీశిష్యుడు హరిశ్చంద్రుడు నన్ను దబాయించి, నాడగు చెమ్కీకోటును కొట్టివేసినాడు వశిష్ఠా. నీశిష్యుని కుళ్ళు గుణంబుల కొంచెమైనను మాన్పవుగదా!

వశి — ఇంకోటి తెచ్చుకోలేక పోయావూ?

దేవేం — రెండే చెమ్కీ కోట్లు వున్నాయట. కనక మిగిలిన దానితోనే గడుపుకోవాలన్నారు ఆర్గనైజరుగారు. చేతులు లోపలికి మడిచేస్తే బాగానే వుంటుందిట.

వశి — అంతా బేవార్సు వ్యాపారంగా వుందే.

దేవేం — ఈ కోటెలావున్నా నాకొకటేగాని, నే పద్యం పాడ కూడదంటాడుగదా డైరెక్టరుగారు: ఎలాగ చెప్పు!

వశి — పోనిద్దూ నీకెందుకు పద్యం.

దేవేం — మీరందరూ చదవగాలేనిది నే చదవకూడదా?

వశి — ఇది మరీ బాగుంది. నీకు శ్రుతి అయినా కలవదు.

దేవేం — నాకు చాలా ఇదిగావుందోయ్ స్టేజిమీద ఒక్కపద్యం చదవాలని.

వశి — ఇంకో నాటకంలో పెట్టిద్దాంలే.

దేవేం — ఇంకో నాటకంలోకాదు. నాకు ఇందులోనే కావాలి.

దేవేం — ఇప్పుడు అర్థాంతరంగా పద్యం రావాలంటే ఎక్కణ్ణుంచొస్తుంది?

వశి — ఇప్పుడు అర్థాంతరంగా కాదోయ్. ఒక్కపద్యం చాలా రోజులనించి ప్రాక్టీసు చేస్తున్నాను. డైరెక్టరుగారికీ నీకూ కొంచెం స్నేహమున్నట్టుంది. అయనతో చెప్పి ఒప్పించలేవూ?

వశి — ఆయన ఒకడు చెబితే వినడు. లాభంలేదు.

దేవేం — డైరెక్టర్ గారితో చెప్పకుండా అకస్మాత్తుగా పాడెస్తేనో?

వశి — బయటకొచ్చింతరవాత నరుకుతారు. పద్యం సహంలోనే బయటికి ఈడవడాని కొచ్చినా రావొచ్చు.

దేవేం — మధ్యలో ఆపలేడులే. దడదడ చదివేస్తాను. అయి పోయిం తరవాత ఆయన మాటలంటే మాత్రమేం? దులిపేసు కుంటాను!

వశి — హార్మోనియమ్ వగైరా ఎక్కంపెనీమెంట్లు ఏమీ అక్కర్లేదా ఏమిటి నీపద్యానికి?

దేవేం — హార్మోనిష్టుతో మాట్లాడాను. నాపోర్షన్ గుర్తెట్టు కుని అందిస్తానన్నాడు.

వశి — బందోబస్తు అంతాచేసుకునే వొచ్చావన్నమాట....ఏదీ ఎలా చదువుతావో ఓమాటు వినిపించు.

దేవేం — డైరెక్టర్ గారితో చెప్పకుండా వుంటావా?

వశి — ఊఁ.

దేవేం — ఊఁ అంటేకాదు. 'చెప్పను' అను.

వశి — చెప్పను.

దే — ఒట్టా!

వశి — ఏమిటిది, చిన్నపిల్లల్లాగ.

దే — చేతులో వొట్టెయ్యి.

వశి — [చేతులో చెయ్యివేస్తాడు] పాడు మరి.

దే — (గొంతుకు సవరించుకుని) హార్మోనియమ్‌లో పాడితే బాగానే వుంటుందిలే.

[కొట్టిన సోడాతో కుఱ్ఱాడు లోపలికొస్తాడు]

దే — రారా అబ్బాయి. సమయానికికొచ్చావు. ఇలాతే.

వశి — నాకోసం తీసుకొచ్చాడు.

దే — మళ్ళీ ఇంకోటి తెస్తాడులే.

వశి — నాలుగు పద్యాలు చదవ్వలసిన నేను ఆడుగుతేనే నసిగాడు ఆర్గనైజర్‌గారు. ఆఫీషియల్‌గా ఒక్క పద్యమూలేని నువ్వే అందరికంటె ముందుగా సోడా తాగేస్తే, ఏంకోప్పడతారో (అని కుఱ్ఱాడి దగ్గరనించి సోడా తీసుకోబోతాడు).

దే — [కలియబడి తీసుకొని] మరేంభయంలేదు. ఇది తాగితేగాని గొంతుక తెగదు. [అని గడగడ తాగేస్తాడు] (కుఱ్ఱాడితో) వొరేయ్, ఇంకోటి తెచ్చిపెట్టు!....ఘాటుగాలేదు. రోజుర్సు కానట్టుంది. (గొంతుక గట్టిగా సవరించుకుని, ఎక్కడా శ్రుతికలవకుండా పద్యం చదువుతాడు).

"సరసులగు పండితుల విమర్శనములెల్ల
గడచినదె కద నిర్దుష్ట కావ్యమగును"

వశి — ఏం రాగమిది ?

దే — ఏం అలా అడిగావు? కమాచిరాగం. కాదా అంటే కొన్ని శ్రీరాగం ఛాయలు పడ్డాయి.

వశి — హార్మోనియమ్‌లో కలిపావా ?

దే — ఓ. మరీ ఎక్కడైనా శృతి తప్పబోతే, జంయ్‌మని ఒక్కమాటు అన్నిమెట్లూ నొక్కేసి కప్పేస్తానన్నాడ హార్మో నిష్టుగారు.

వశి — దివ్యంగా వుంది. కానియ్యి ముందరే చెప్పావు. నీకు కొంచెందూరంలో కూచుంటే మంచిది. ఏ చెప్పేనా ఎగిరొస్తే. గురితప్పి నామీద పడకుండా వుంటుంది.

దే — ఓస్, హరిశ్చంద్రుడుమాత్రం శృతితప్పడంలేదా ? ఛాలెంజి.

[అంటూవుంటే లోపలికి హరిశ్చంద్రుడు వొస్తాడు. అతను సహారంగు వేసుకున్నాడు. పట్టుపంచ కట్టుకుని, జిమియాన్ వేసుకునివున్నాడు. చేతిలో అద్దం. దేవేంద్రుడు. ఈసంగతి ఎవరితోటీ చెప్పొద్దని సంజ్ఞచేసి. బయటికి వెళ్ళిపోతాడు]

హ — వారేయ్. కుట్టాడా ! హార్మోనిష్టుగార్ని ఓమాటు పిలుచుకురా. అర్జెంటుగా మాటచెప్పాలి.

(ఎవరూ మాట్లాడరు)

హరి — ఏడీ కుట్టాడు ?

వశి — కుట్టాడెవడూ లేడు !

హరి — మీరొక్కమాటు వెళ్ళి హార్మోనిష్టుని పిలుచుకొస్తారా ?

వశి — ఎందుకు ?

హరి — పిలుచుకురండి. వూరికే ప్రశ్నవెయ్యక :

వశి — నాకు వేరే చాలాపనుంది. వెళుతున్నాను. ఇక్కడి నించే గట్టిగా కేకేస్తే, వొస్తాడు [అని గబగబ వెళ్ళిపోతాడు]

హరి — వెధవగోరోజనం. నాకాళ్ళట్టుకుంటే పద్యాలపాట్లు ఇప్పించాను రంగేసుకునేసరికి గొప్ప actor అయిపోయా ననుకుంటున్నాడు కాకోలు. వొదలగొడతాను. హార్మోనిష్టుగారూ.... హార్మోనిష్టుగారూ....

[హార్మోనిష్టు లోపలికొస్తాడు]

హరి — రండి. 'పాత్రదానంబు' అనే పద్యముందే, కమాచిలో పాడదామని మొదట అనుకున్నాను. నిన్న కొంతమంది స్నేహితులకి అది మోహనలో పాడి వినిపిస్తే కమాచికంటే అద్భుతంగా వుందన్నారు. మోహనలోకి మార్చెయ్యండి.

హార్మో — అలాగే.

హరి — "పాత్రదానంబు, సుంకైన ఫలముగాంచు
ఫలములేదెంత యిడిన పాత్రమునకు"

ఒక్కమాటు వాయించికూడా చూసుకుంటారా ఏమిటి ?

హార్మో — అక్కర్లేదండీ, నే గుర్తుపెట్టుకు వాయించేస్తాను.

హరి — మాట [అని హార్మోనిష్టు భుజంమీద చెయ్యేసి. స్టేజి మొదటికి తీసుకెళ్ళి రహస్యం చెబుతున్నట్టు] ఈ వశిష్ఠుడుగాడికి

చాలా గోరోజనంగావుంది. తనేదో గొప్పగా పాడతాననుకుంటు న్నాడు. పొదలగొట్టాలి....ఏమంటారు ?

హా — ఆ, పెద్ద ఏం పాడతాడులెండి.

హరి :— వాడేం పాడగలడండి, వాడిమొహం. మీరు ఎక్కడికి అక్కడ అందిస్తూవుంటే ఏదో తోసుకుపోతాడు. మీరోమాటు బోల్తాకొట్టించాలి.

హార్మో — నేనేం చెయ్యగలను ?

హరి — ఒకరాగానికి బదులు మరోరాగం అందిస్తేచాలు, చచ్చి వూరుకుంటాడు. మీరు చాలా కష్టపడ్డారు. అనుకున్న దానికంటె ఎక్కువ రిహార్సల్సుకి కూడా వొచ్చారు. పాతిక రూపాయలు ఎక్కువివ్వమని ఆర్గనైజర్ గారితో చెప్పాను ; తెలిసిందా !

హార్మో — ఊఁ.

హరి — వశిష్ఠుడికి బాగా బుద్ధొచ్చేటట్టు చెయ్యాలి. ఊఁ.... మరిచిపోయాను. నే పాడినవెంటనే చంద్రమతి ఎత్తుకునేచోట్ల కూడా జాగ్రత్తగా వాయిస్తారుకాదూ ? లేకపోతే నే ఖూనీ అయి పోతాను.

హా — అలాగే.

హరి — పాతికరూపాయలూ మీకు ముట్టేటట్టు చూస్తానులెండి. జాగ్రత్తగా వాయించండి.

[అని లోపలికి వెళ్ళిపోతాడు]

హా — ఇనకతక్కెడా పేడతక్కెడ వ్యవహారంగావుంది (అని వెళ్ళిపోబోతూవుంటే, హార్మోనిష్టుగారూ అంటూ దేవేంద్రుడు లోపలికొస్తాడు)

దేవే — నే చెప్పింది మరిచిపోయి కారూ ?

హా — మరిచిపోను.

దే — మీపుస్తకంలో మార్కు పెట్టుకున్నారా ?

హా — ఆ.

దే — 'ఆహా. ఎంతబాగా పాడగలడువీడు' అనుకునేటట్టు వాయించెయ్యాలి.

హా — ప్రయత్నిస్తాను.

దే — ప్రయత్నిస్తానంటేకాదు, చేసితీరాలి. అంతా మీచేతుల్లోనేవుంటుంది. కపిలవాయి రామనాథశాస్త్రికి ఏంపాటొచ్చును చెప్పండి. రామానుజులు హార్మోనీమీద, పద్యం చదవడం నేర్పాడు. అద్భుతంగావుందని జనం విరగబడ్డారు. రామానుజులు లేకుండా పాడమనండి, పడిసిపెట్టుండేది.....మీకష్టం మరిచిపోను లెండి....ఈ అయిదూ దగ్గిరుంచుకోండి (అని అయిదు రూపాయల నోటు తీసి ఇస్తాడు) మనం అనుకున్నది బాగాజరిగితే, మరో అయిదుకూడా....

హా — మీరిన్నిమాట్లు చెప్పాలా ?

దే — (స్టేజి చివరదాకావెళ్ళి) "సరసులగు పండితుల విమర్శనములెల్ల" (అని కూనిరాగం తీసుకుంటూ లోపలికి వెళ్ళిపోతాడు)

హ — వీడికి పురమెడితే పద్యం పదపద మొస్తుందా? పైగా రామనాథశాస్త్రితో పోల్చుకుంటాడు! (వెళిపోతాడు)

[స్టేజిమీద ఒక్కక్షణం ఎవరూవుండరు. హరిశ్చంద్రుడు వస్తాడు. అతని మేకప్ ఇంకా పూర్తికాలేదు. చేతిలో అద్దం]

హరి — అబ్బబ్బ. చచ్చిపోతున్నాం. లోపల గాల్లేదు, రండి. ఇక్కడేవేద్దురుగాని (అని స్టేజిమధ్య కూచుంటాడు)

[అతని వెనకాలే make up మనిషికూడా వస్తాడు. అతనిచేతిలో సీసావుంటుంది. అందులో వున్నది Rose Water. హరిశ్చంద్రుడిముందు కూచుని, నీళ్ళు మొహం మీద కొట్టి, మొహంమీద అరిచేతులతో పటపటమని కొడతాడు]

హరి — Barbarous. వెధవకేక్. Maxfactor తీసుకు రావయ్యా అంటే ఎగేశాడు, ఆర్గనైజర్.

[డైరెక్టర్ గబగబ లోపలికొస్తాడు]

డై — అయ్యో, తొమ్మిదింటికి పదినిమిషాలే వుంది. మీరింకా తయారుకాలేదు, ఎలా?

హరి — Maxfactor తీసుకురావయ్యా అంటే విన్నాడు కాదు. తయారవమంటే ఎలా అవుతాం!

డై — పోనీ, మొదటిసీనుకి స్టేజి తయారుచేద్దామంటే ఒక్క నౌకరు కనిపించడు. ఇద్దర్ని ఇక్కడ పెట్టండని చెప్పాను!

హరి — కఱ్ఱపెత్తనం చెలాయించడంతప్ప, ఈ ఆర్గనైజర్ ఏమీ చెయ్యడనుకోండి.

డై — పోనీ, నేనే అరేంజి చేసుకుంటాను. స్టేజిమధ్యకొచ్చి కూచున్నారేమిటి ? లేవండి.

హరి — లోపల గాలెయ్యడంలేదు. నే అక్కడికి వెళ్ళను.

డై — మీరిక్కడే కూచుంటే నే అరేంజి చేసేదెలా ?

హరి — మేమంచరం తయారుకాకుండా మీరు సీను అరేంజి చేసుకునిమాత్రం ఏం లాభమండీ, ఓ పావుగంట తిరిగిరండి. అప్పటికె చాలామటుకు అయిపోతుంది.

డై — ఎన్నిగంటలకి ప్రారంభిద్దామనేనిటి ? తొమ్మిదికని ప్రకటనచేశాం. వేళకి మొదలెట్టాలి.

హరి — మీకేం వెఱ్ఱా ఏమిటండి ? ఎనిమిదిగంటలకి మొదలెడతామన్నా, నిజంగా మొదలెడతామని ఎవరూ అనుకుని వుండరు ! అంచేత అందరూ లేటుగానే వొస్తారు... ఆడియన్సు ఏమాత్రం వొచ్చిందేం ?

డై — ఆడియన్సు ఎంతుంటేనేం ? అనుకున్నటైముకి ప్రారంభించాలి. అప్పుడు గాని ఆడియన్సుకి punctuality అబ్బదు.

హరి — ఈనాటకం వేస్తున్నది, కళాప్రదర్శనానికిగాని, audience కి punctuality నేర్పేటందుకు కాదండీ....

audienceలేకుండా నాటకమేమిటి? మీరలా బయట తిరిగే రండి ఒక్కమాటు

డై— ఛీఛీ. Most disorganised ....ఆర్గనైజర్ గారేరీ. ఆర్గనైజర్ గారూ....

(ఆర్గనైజర్ లోపలికొస్తాడు)

డై — తొమ్మిదింటికి అయిదునిమిషాలేవుంది.

ఆ — వుండనివ్వండి....జనమేమన్నా వొచ్చిందోలేదో.... (పైకి తొంగిచూసి) హాలు నిండిపోయినట్టేవుందే....నాటకమంటే ఎక్కడెక్కడివించో కొట్టుకొస్తారు.

డై — ఇప్పుడెలా !

ఆ — భయపడకండి తొమ్మిదిన్నరకి మొదలెట్టొచ్చు.

డై — నో నో, ఇప్పుడేదన్నా చెయ్యాలి.

ఆ — తొందరపెట్టకండి. రెండో bell కొట్టించేస్తాను (అని గంట తీసుకొచ్చి స్టేజి ఒకచివరినుంచి రెండో చివరదాకా వాయిస్తాడు. వాయించుకుంటూ పైకి వెళిపోతాడు) ఇంకో అర గంటకి మూడో bell కొట్టొచ్చు.

డై — Bad, that's very bad....వశిష్ఠుడూ దేవేంద్రుడూ ఏరీ....వాళ్ళకి last minute instructions ఇవ్వాలి. పిలుచుకురండి Organiser గారూ....

హరి — ఇంకా ఎందుకొచ్చిన instructions అండీ. ఇన్నాళ్ళూ మీరు నూరిపోస్తేరానిది ఇప్పుడు చంపుతేమాత్రం వొస్తుందా? వూరుకుందురూ...

డై — Details చెప్పను... ఒక్కమాటు బ్రషప్ చేస్తాను. (అంటూవుంటే దేవేంద్రుడు లోపలికొస్తాడు)

దే — అర్గనైజర్‌గారూ, హారతి కర్పూరం కొబ్బరికాయా తెప్పించారా?

డై — ఏ సీన్లోకావాలవి?

దే — సీన్లో కాదండి ప్రేయర్‌కి.

డై — మోడరన్ నాటకప్రదర్శనాలకి ప్రేయర్ వుండకూడదు. వుండదని నే చెప్పలేదూ....

దే — ప్రేయర్ పాడి, మనసమాజానికి జై అనకుండా నాటక మేమిటండీ....ప్రేయర్ లేకుండా తెరఎత్తడానికి వీల్లేదు.

డై — ప్రేయర్ చేస్తే, ఈ నాటకంతో నాకేం సంబంధ ముండదు.

దే — ఏమిటండీ మీరు అడుగడుక్కీ బెదిరింపులే (అంటూ వుంటే, అతిదూకుడుగా విశ్వామిత్రుడు లోపలికొస్తాడు. అతని చేతిలో ఒక గడ్డముంటుంది. కాషాయవస్త్రాలు కట్టుకుని గడ్డం మినహా మిగతావేషమంతా పూర్తయింది)

విశ్వా — ఏమండీ డైరెక్టరుగారూ, ఈవెధవ పీచుగడ్డం నే పెట్టుకుతీరాలన్నారా? (అని చేతులోవున్న గడ్డం డైరెక్టర్ మీద విసిరేస్తాడు).

డై — ఏం, దీనికేమొచ్చింది?

విశ్వా — ఇది హిరణ్యకశ్యపుడు తంతూవుంటే, దెబ్బలుతిని పారిపోతున్న ఋషులు పెట్టుకునే పీచుగడ్డంకాని, విశ్వామిత్రుడు పెట్టుకునే గడ్డంకాదు.

డై — అంటే?

విశ్వా — విశ్వామిత్రుడిగడ్డం షోకుగావుండాలండీ. వాడు అల్లాటప్పా ఋషికాడు. మేనకతో సరసాలాడినవాడు. సృష్టికి ప్రతిసృష్టి చేసినవాడు. రంభ, ఊర్వశి, తిలోత్తమ వుంటున్న దేవేంద్రసభలోకి వెళుతూ, ఈవెధవ పీచుగడ్డంటండీ పెట్టుకువెళతాడు!

డై — మిమ్మల్ని నే మొదటినించీ చూస్తున్నాను. ప్రతిదానికీ పేచీపెడుతున్నారు, మీరు ఈగడ్డమే పెట్టుకుతీరాలి.

వి — విశ్వామిత్రుడికి గడ్డలేంకుండా అయినా వేస్తానుగాని ఈగడ్డం పెట్టుకోను.

[అర్గనైజర్ లోపలికొస్తాడు]

ఆ — దేనికండి మళ్ళీ పేచీ....

విశ్వా — నాకేదో వెధవగడ్డంపెట్టి, నా కారక్టరంతా పాడు చేద్దామని చూస్తున్నాడు ఈయన.

డై — ఈ నాటకంలో ఏ కారక్టర్ ఎలావుండాలో నిర్ణయించేది నేనుకాని పాత్రధారులుకాదు.

వి — మిగతావాళ్ళ విషయంలో మీయిష్టమొచ్చినట్లు నిర్ణయించుకోండి. నా కారక్టర్ జోలికిమాత్రం రాకండి.

డై — నాటకం ఇవాళే అయిపోయిందిగాని, ఓవారం రోజులు టైమున్నా మిమ్మల్ని తీసేసి ఇంకోణ్ణి తయారుచేద్దును.... అయ్యా, ఆర్గనైజర్ గారూ, ఈ నాటకంలో విశ్వామిత్రుడితో ఇహ నాకు సంబంధంలేదు. విశ్వామిత్రుడివల్ల నాటకమంతా తగలడిపోయినా, నాకేమీ బాధ్యతలేదు.

వి — నావల్ల ఏమీ తగలడదు. నా ప్రోజుకికూడా ఆడియన్సు వన్సుమోర్ అనకపోతే చెవికోయించుకుంటాను. ఫస్టుహాఫ్ నాటకం నామూలాన్నే రక్తికడుతుంది.

ఆ — ఆ గొడవంతా ఎందుకిప్పుడు. త్వరగా తెముల్చుకురండి. టైమయిపోయింది. మూడో బెల్లు కొట్టెయ్యాలి.

వి — క్రీప్ హెయిర్ తో, చక్కగా ట్రిమ్ చేసి గడ్డం పెట్టించుకో వచ్చునంటేనే వుంటాను. లేకపోతే, వేషం పీకేసుకు ఇంటికి పోతాను.

డై — ఆల్ రైట్. విశ్వామిత్రుడు లేకుండా నాటకం వేయించేస్తాను. వెళ్ళండి.

విశ్వా — మానాయనే: అసలు డైరెక్టర్ లేకుండా లక్షనాటకాలు వేశాం. గుడ్డికన్ను మూసినా తెరిచినా ఒకటే కనక తమరు దయచెయ్యండి ఇంటికి.

డై — (కోపంతో) గెటవుట్.

విశ్వా — (అమితకోపంతో) యూ గెటవుట్ ఫస్టు.

[థర్డుబెల్, థర్డుబెల్ అని అరుచుకుంటూ ఆర్గనైజర్ మధ్యకి ఉరుకుతాడు. గంట వాయించుకుంటూ, అటూ యిటూ తిరుగుతాడు. ప్రేయర్, ప్రేయర్ అని అరుచుకుంటూ వశిష్ఠుడు లోపలికొస్తాడు. హారతిపళ్ళెం, కొబ్బరికాయ, అని అరుచుకుంటూ దేవేంద్రుడు పైనించివొచ్చి, గ్రీన్‌రూమ్‌లోకివెళ్ళి పళ్ళెంతో మళ్ళీ పైకొస్తాడు. హార్మోనీ వాయించమని ఆర్గనైజర్ ఈలవేశాడు. హరిశ్చంద్రుడులేచి "పరాబ్రహ్మ" అని పాట మొదలెడుతాడు. అందరూ అందుకుంటారు. అందరూ తలోస్థాయిలోనూ పాడతారు. పాటపాడుతూనే దేవేంద్రుడు....సిగరెట్టు ముట్టిస్తాడు. పాట అయిపోగానే "రాష్ట్రేతర ఆంధ్రనాటక సమాజానికి జై" అని అరచి కొబ్బరికాయ పగలగొడతారు]

ఆర్గ — కర్టెన్ కర్టెన్, తెరతియ్యండి.

ఈల

(తెర పడుతుంది)

---

# ఆంధ్ర నాటకరంగానికి జై



[ఈనాటికకి కథావస్తువు పాదుకాపట్టాభిషేక నాటిక ప్రదర్శనం నడుస్తూ వుండగా జరిగిన ఒక సంఘటన. జరుగుతున్న నాటక ప్రదర్శనం సూచించే నిమిత్తం, భరతప్రవేశందాకా సంభాషణలు పానుగంటి లక్ష్మీనరసింహరావుగారి పాదుకాపట్టాభిషేక నాటకంలో, పిదపఅంతవు సంభాషణలని అనుసరించి వ్రాయబడినవి. మొదటి రెండు పద్యాలూ కూడా ఆనాటకంలోవే. మిగతామూడు పద్యాలూ, భాస్కరరామాయణంలోనివి.]

["శ్రీరామ పాదుకాపట్టాభిషేక" నాటిక జరుగుతున్న సమయంలో ఈనాటిక ప్రారంభమౌతుంది. తెరలేచేసరికి నడుస్తున్నది. పాదుకాపట్టాభిషేక నాటకంలో, శ్రీరామచంద్రుని భరతుడు కలుసుకుని పాదుకలు పుచ్చుకునే ఘట్టం. చిత్రకూట పర్వత సమీపారణ్యభాగం సూచించే వెనక తెర. తెరలేచేసరికి ఎవరూ వుండరు తరవాత శ్రీరామచంద్రుడు ప్రవేశం]

శ్రీరా — ఇక్కడ....తమ్ముడా....ఇటురా.

లక్ష్మ — (ప్రవేశించి) అగ్రజా ! మహాప్రమాదము సంభవింపనై యున్నది. సీతాదేవి నెచటనైన భద్రపరచవలయును. మన మిద్దరమును కవచితాంగులమై, ధనుష్పాణులమై ఆ మహాసైన్యమును పర్వతాగ్రమెక్కి మార్కొనవలయును. తొందరపడుడు. తొందరపడుడు.... మీ ధనస్సు ధరించుడు. సందేహించు చుంటిరేల ? మనకన్నిటికంటె జానకీ రక్షణమే ప్రధానము గావున మీరు తత్సంరక్షణార్థమై ఆమెయొద్దనేయుండుడు. నేనొక్కడనుబోయి....

శ్రీరా — (చిరునవ్వుతో) వోయి ఏమిచేసెదవు.

లక్ష్మ — సేనను చీల్చి చెండాడి వైచెదను.

శ్రీరా — ఆసేన యెవ్వరిదో బాగుగ కనిపెట్టితివా !

లక్ష్మ — దుష్టబుద్ధి, సౌహార్ద్రహీనుడు, క్రూరుడు, భరతుని సేన యది.... అగ్రజా సెలవిమ్ము.

శ్రీరా — తొందర ఏమియును లేదు. అనవసరమగు కోపము చల్లార్చుకొనుము.

లక్ష్మ — అగ్రజా ! రామభద్రా ! ఇకనేను సహింపను. వాని చిత్రవధమునుచేసి, దుశ్చేష్టురాలైన కైక తలత్రెంపి....

శ్రీరా — ఏమి యీ కఠినోక్తులు. నేనన్న నీకెంత భక్తియో అంతకంటె నెక్కుడుభక్తి భరతునికి నాయందు గలదు......... లక్ష్మణా : ఎంతవెఱ్ఱి పడితివి. చిరంజీవియైన సోదరుడు వచ్చుచుండ, గాఢాలింగనమును జేసికొనవలయునుగాని, కత్తులేల ? కటారులేల ? కవచములేల ? ఈకఠినోక్తులేల ? మనలజూచి, సుకుమారియగు జానకిని తీసుకొనిపోవుటకు తండ్రిగారే విచ్చేయుచున్నారేమో.

లక్ష్మ — తండ్రిగారు విచ్చేయుచున్నట్లు తోచదు.

శ్రీరా — ఏల ?

లక్ష్మ — ఆయన శ్వేతచ్ఛత్రాది చిహ్నము లేవియు నగుపించుటలేదు.

శ్రీరా — హా ! హా ! కనుపించుటలేదా, లక్ష్మణా? ఏదైన కీడు మూడి యుండలేదుకదా ! తండ్రిగారు జీవించియుండెనో లేదో ?

లక్ష్మ — ఉపద్రవమేదైన జరిగిన మనకు వార్త రాకుండునా ?

రామ — ఏమోకాని మనసు కలత నొందుచున్నది. మనము పోయి భరతాదులను పర్ణశాలయొద్దనే కలిసి కుందము రమ్ము.

" అమ్మలను దమ్ములను జూతునంచు ముదము
గలగదేలకో ? కడుపులోపలను బెద్ద
రాయిపడె : నెట్టివార్త కర్ణముల బడునో
హేతుశూన్యార్తి యూరికే యేగదెపుడు ! "

తమ్ముడా ! ఇటురా !

[ రామలక్ష్మణులు వెళిపోతారు. రెండోపక్కనుంచి భరతుడు ప్రవేశం. అతని వెనకాల వశిష్ఠుడు, సుమంత్రుడు, జాబాలి వొస్తారు ]

భర — గురూత్తమా ! భరద్వాజులవారు చెప్పిన ప్రదేశ మిదేయే యైయుండునా ?

వశి — అటులే తోచుచున్నది.

జాబాలి — తోచుటమాత్రమేకాదు. నిశ్చయముగ నిదియే. అదె చిత్రకూట పర్వతము. అల్లదె మందాకిని నది.

సుమం — అల్లదిగో ఒక కుటీరముకూడా కాన్పించుచున్నది. ఏ మునీశ్వరుల కుటీరమో

జాబ — ఏ మునీశ్వరులో యననేల ! మన మునిబాలకుల యాశ్రమమే యిది !

భర — హా రామచంద్రా ! ఎంతవిపత్తు వాటిల్లినదయ్యా ! మునీంద్రులారా, రండు. సీతాలక్ష్మణసమేత శ్రీరామచంద్రుని కలుసుకుందము ( ఒక్క అడుగునడిచి, ఆగి ) సుమంత్రా, రాము నివాసముచే పవిత్రమైన ఈప్రదేశమునకు మనుస్యులు గాని, గజములుగాని సమ్మర్దము కలుగజేయకుంటునట్లు నీవుపోయి సేనాధిపతి కాజ్ఞాపింపుము........పొమ్ము ( అని నించుంటాడు )

సుమం — ( కొంచెము ముందటికివెళ్ళి తనలో ) ఇదేమిటి ? నా పార్టులోనే ఇక్కడే ఉండి కేకెయ్యాలనిఉంది. పొమ్మంటా దేమిటి ( అని, భరతుడుకేసి చూస్తాడు. భరతుడు తీక్షణంగా చూస్తాడు. సుమంత్రుడు, నాకేంలే అన్నట్టు భుజాలెగెరేసి, తల వంచుకుని ) చిత్తం ( అని వెళిపోతాడు )

భర — మునీంద్రులారా ! రండు. ( అని వెళతాడు. అతని వెనకాల మిగతావాళ్ళు వెళ్ళగానే సుమంత్రుడు లోపలికొస్తాడు. )

సుమం — ఇంకోమాటు నాపార్టు మళ్ళీ గజిబిజిచేస్తే డొక్కబద్దలుకొడ్తాను, ఏమనుకొన్నాడో (పార్టు అందుకునేటట్టు, లోపలినించి, ప్రాంప్టింగు వినిపిస్తుంది. "అరుగో రామలక్ష్మణులు.... అరుగో రామలక్ష్మణులు." సుమంత్రుడు అందుకుని)

అదుగో రామ లక్ష్మణ జాబాలి వశిష్ఠ భరతు లిటకే వచ్చు చున్నట్లున్నారు. సీతాదిస్త్రీజనము శత్రుఘ్నపూర్వకముగ పర్ణశాల ప్రవేశించినట్లున్నది.

[రాముడు, జాబాలి, వశిష్ఠుడు, భరతుడు ప్రవేశము]

వశి — వత్సా ! శ్రీరామచంద్రా ! విచారింపకుము. భరతుడు నీతో నొక విన్నపము చేసుకొన విచ్చేసినాడు. భరతా ! అన్న గారితో మనవి చేసికొనుము.

భర — అగ్రజా ! (అని వాక్యం ప్రారంభించగానే శ్రీరాముడు అందుకుంటాడు)

శ్రీరా — వత్సా, భరతా !

" యుష్మదభిసంధి ఇప్పటి కుంచు మటులు
వల్కములేల ? జటలేల ? వనములేల ?
సుఖవిసర్జనములేల ? శోకమేల ?
మునిగతు లివేల ? చెప్పుము ముందు తండ్రి ? "

భర — (తనలో) నాపద్యం అయినతరువాత వీడి పద్యం చదువలసినది. నాకంటె ముందుగానే చదివి టోకరా తినిపిద్దా మనుకున్నాడు. వెంటనే నే పద్యం చదవనే చదవను. నాదగ్గరా, యీటిక్కులు ! (పైకి) నీచురాలయిన కైకేయి మాటమేరకు మీరు కాననంబులనుండి, నే నయోధ్యారాజ్యపాలనము చేయ లోకులు 'నన్ను గర్హింపరే ! అగ్రజా, మరుడి రమ్ము.'

[అక్కడ చదవవలసిన పద్యం చదవకుండా ప్రోగ్రాముక్కలు చదివేసరికి అందరూ తెల్లబోయి చూస్తూఉంటారు. శ్రీరాముడు బదులు చెప్పడు.]

భర — రామచంద్రా నిరుత్తరుడవై యుండుట తగునా ? వశిష్ఠా ! జాబాలీ !

" మహనీయమణిమయమందిరంబులనుండు
ప్రభుడు నే డున్నాడు పర్ణశాల
మెత్తనిపాన్పున మేనొత్తసుఖి నేడు
తనువు సేర్చినవాడు దర్భశయ్య
లలితమాల్యంబులు లలిబూను పతినేడు
వలనొప్ప గయికొన్న వాడు జడలు
మృదులాంబరమ్ములు మెఱయు పుణ్యుడు నేడు
వలనొప్పగాఁ బెను వల్కలములు

కోరి రాజన్య లోకంబు గొల్చు రాజ
మౌళి నేడు మునిసేవ మరిగినాడు
వలసె నాకిప్పు డీ దురవస్థచూడ
కైక కడుపున బుట్టిన కారణమున.

వశిష్ఠా ! జాబాలీ ! మీరైనను చెప్పరాదా !

[దీనితో ఆనలే గలభా అవుతుంది. ఈపద్యం ప్రోగ్రాములో లేనిది చదివాడు]

వశి — ( ముందుకొచ్చి. జాబాలితో ) వెధవ, ఎక్కడివో పద్యాలు ఝుణాయిస్తున్నాడు.

జాబా — వీడికెప్పుడూ వున్నరోగమే. ఓమాటు బాగా బుద్ధి చెప్పాలి.

వశి — చిల్లర పాత్రగాళ్ళం మనకెందుకులే.

జాబా — మనలాటి వాళ్ళదగ్గిరే తనప్రతాపం మరీచూపిస్తాడు. బయటికిరానీ! కాళ్ళిరగ కొడతాను.

భర — మునీశ్వరులారా! ఏల నిరుత్తరులైనారు, శ్రీరామచంద్రా! ఇదియె నా కడపటి విన్నపము, వినుము.

"నీదగు రాజ్యలక్ష్మి ధరణీ
వర యేను ధరింపజాల ని
త్యోదయ సంపదల్ వొదలుచుండ
ప్రజాపరిపాలన క్రియా
పాదన లీలతో భువన భారము
పూనగ నేగుద మ్మయో
ధ్యాదయి తత్వ మన్యులకు
నర్హము గాదటు గాక దక్కినన్.

[ఆడియన్సులో ఒక వక్కనించి చప్పట్లు; సెభాస్. వన్సుమోర్ అని కేకలు. భరతుడు ఆపద్యం మళ్ళీ చదువుతాడు. ఆపద్యం ఆఖరవుతున్న సమయంలో భరతుణ్ణి మెచ్చుకుంటున్న వైపునించి స్టేజిమీద పువ్వులు పడతాయి. భరతుడు ఆ పువ్వులుకొన్ని, ఏరి, కళ్ళకద్దుకుని ప్రేక్షకులకి దండం పెడతాడు. మళ్ళీ చప్పట్లు. మరోమూలనించి

ఈలలు. ఒక ప్రేక్షకుడు గబగబా వెళ్ళి స్టేజిఎక్కి రాముడికీ భరతు
డికీ మధ్య నించుంటాడు. గుక్కతిప్పుకోకుండా ఉపన్యాసం ఇస్తాడు.
భరతుడు మిగతా పాత్రలందరూ తెల్లబోయి చూస్తూ వుంటారు]

ప్రేక్ష — సోదర సోదరీ ప్రేక్షకులారా! నేను మధ్యలో ఈ విధంగా నేనిక్కడికొచ్చి ఉపన్యాసం ఇవ్వడానికి పూనుకున్నందుకు, నాసాహసం మీరందరూ మన్నించాలనీ, మన్నిస్తారనీ భావిస్తున్నాను. సీను అయిపోయేదాకా వుంటే బాగుండునేమోకాని, ఇది ఆఖరిసీను. ఈసీను అయిపోగానే నే ఉపన్యాసం ప్రారభించినా, ఎవరూ వినకుండా వెళిపోవచ్చు. పైగా కాలుకదపడానికైనా వీల్లేకుండా ఇరుక్కుపోయి కూర్చున్నాం. నాటకం అయిపోయినా కూడా బాధపెట్టడం భావ్యంకాదు. అంచేతే ఇప్పుడే వొచ్చేశాను. మొదట చెప్పినట్లు మన్నించారనుకుంటాను.

ఆడియన్సులోంచి ఒకడు — సంగతేమిటో తేల్చండి, ఉపోద్ఘాతం కట్టిపెట్టి.

మరోపక్కనించి ఇంకోడు — త్వరగా దిగండి మంచి రసకందాయంపట్టులో ఆపేస్తున్నారు.

ప్రేక్ష — నాకు తెలుసు. ఆ రసతన్మయత్వమే నన్నీ పనికి పురికొల్పింది. అందులో ముఖ్యంగా భరతవేషం. భరత పాత్రధారి శ్రీ శ్రీ నారాయణగారు మనవూరికి కొత్తకాదు. ఇదివరకు అనేక నాటకాల్లో అనేక వేషాలు వేశారు. నేను వారి నాటకాలు చాలా చూసాను. వారు ఏపాత్ర వేసినా, అందులో లీనమయిపోతారు. కనక

చాలా గొప్ప నటకుడని నాకు చాలాకాలం కిందటే తెలిసిపోయింది. కాని ఈరోజున చదివిన పద్యాలూ, చూపించిన నటనాకౌశల్యం చూసే భాగ్యం మనకీనాడు కలిగించిన శ్రీ శ్రీ నారాయణగారికి మీ అందరి తరఫునా నాధన్యవాదాలు....కళారాధనకోసం నారాయణ గారు చేస్తున్న కృషి వర్ణించడానికి నాకు తరంగాదు. ఇతర నట కుల్లా డబ్బుకక్కుర్తికి వేషం ఒప్పినా, ప్పకపోయినా ప్రతి పాత్రకీ ఒప్పుకొని నాటకాలు తగలేసే నటుడు కాదు ఈయన. తనకి నచ్చిన పాత్రలనే ప్రదర్శించడానికి అంగీకరిస్తాడు. ఒక్క హస్తవిన్యాసం ఒక్క కళాభంగిమ: అంటే పోజ్—పెర్ఫెక్టు చేసే నిమిత్తం ఆయన అహోరాత్రాలు మాని కృషి చేస్తారంటే నమ్మండి. ఇటువంటి అనన్య సామాన్య వ్యక్తిని, కళారాధకుణ్ణి సత్కరించడానికి లక్షలిచ్చినా చాలదుకాని, ఇవ్వడానికి మాదగ్గిర లక్షలు లేనందువల్ల చంద్రునికో నూలుపో గన్నట్టు, మాశక్తిని బట్టి, ఈసువర్ణపతకం బహూకరిస్తున్నాం (సువర్ణ పతకం ఎత్తి ఆడియన్సుకి చూపిస్తాడు. ఇవ్వదలచిన ఉపన్యాసం పూర్తి అయింది.) వొరేయ్ దండ తీసుకురా (అని అరుస్తాడు. ఆడియన్సు లోంచి ఒకడు లేచి స్టేజి ఎక్కి దండ ప్రేక్షకుడికి అందిస్తాడు. ప్రేక్షకుడు భరతుడి మెడలో వేస్తాడు. పతకం చేతికిస్తాడు. భరత పాత్రధారి నారాయణ ముందుకొచ్చి దండం పెడతాడు)

భర -- మీ పొగడ్తలకి నేను అర్హుణ్ణి కానని నాకు తెలిసినా కళారాధకుణ్ణి కనక, నాకళ నాప్రజల మన్నన పడయటమే నా

పరమోద్దేశం కనక, మీరీనాడు నా నటన మెచ్చుకున్నారంటే అనందించి, మీరిచ్చిన పారితోషికం కృతజ్ఞతతో స్వీకరిస్తున్నాను. నాటకకళకే నాజీవితం అంకితం చేసుకున్న సంగతి మీ అందరికీ తెలిసిన విషయమే. కళలన్నిటిలోకీ నాటకకళ ఉత్తమ కళ అని నాఅభిప్రాయం. ఇతర కళల విషయంలో ఒక్కొక్క కళకి ఒక్కొక్క ప్రతిభ చాలితే నాటక కళారాధకుడికి అంటే నటుడికి, సర్వతోముఖప్రతిభ వుండాలి. సంగీతం, సాహిత్యం, వేషధారణ, ఉచ్చారణ, అన్నిటిలోనూ సిద్ధహస్తుడయి వుండాలి. ప్రజారంజకత్వంకూడా తెలియాలి. కనకనే నాటకకళ అన్ని కళల్లోకి ఉత్తమకళ; ఆంధ్రులకి అభిమానకళ. మరో సంగతి; నేను నాటక కళారాధనకి పూనుకున్నది కేవలం నావ్యక్తిగత కళారాధన నిమిత్తమేకాదు. డబ్బుసంపాదన నిమిత్తం అసలే కాదనుకోండి. ఈ నాటక కళద్వారా, ఆంధ్రుల ప్రతిభ, ఆంధ్రుల నైపుణ్యం, భారతదేశంలో వివిధ మూలలా, దైవం అనుకూలిస్తే, బ్రిటను అమెరికా దేశాల్లోకూడా, చాటాలని నాఉద్దేశం. ఆంధ్రులలో ఇతరులని ప్రోత్సహించడం కొంచెం తక్కువ. మీరు నన్ను ఈ విధంగా ప్రోత్సహించినందుకు నే చాలా కృతజ్ఞుణ్ణి. ఈ భరత పాత్ర నిర్వహించడానికి నేను ఎంత శ్రమపడ్డానో చెపితే మీరు ఆశ్చర్యపోతారు. ఒక్క ఈసీనులో చదివే నాలుగు పద్యాలే రెండు నెలలు ప్రాక్టీస్ చేసాను.

[ఇప్పటి దాకా ప్రేక్షకులు విశ్శబ్దంగా కూచున్నారు. గాని దీవితో కొంచెం కలకలం బయలుదేరుంది, అపియన్సులో ఒక పక్కనుంచి]

ఒకడు -- కొయ్.

రెండోవాడు -- వేయించుకున్నావుగా దండ

మూడోవాడు — ఇహ కానివ్వండోయ్ నాటకం

[ దండవేసిన ప్రేక్షకుడు ఆడియన్సువైపుకి తిరిగి "సైలెన్సు" అని అరుస్తాడు. దానితో, ఆడియన్సులో మరింత గలాభా]

ఒకడు -- నువ్వే సైలెన్సు

రెండో -- దిగు దిగు

[ఆలస్యంచేస్తే ఇంకాగొడవయిపోతుందని గ్రహించి భరతుడు అందరికీదండంపెట్టి]

భర — ఆలస్యానికి క్షమించాలి. [దండవేసిన ప్రేక్షకుడు ఏదో మాట్లాడబోతే వారిస్తాడు] రసజ్ఞప్రేక్షకలోకం రసవత్తర మయిన నాటకాన్ని విలోకించడానికి కుతూహలపడుతోందంటే ఆశ్చర్యంలేదు. కనక మర్కొక్కమారు కృతజ్ఞత తెలియచేస్తూ నాటకం తిరిగి ప్రారంభిస్తున్నాము.

[ స్టేజిమీదికి ఎక్కిన ప్రేక్షకుడు తిరిగిపోతాడు. ఒక్కనిమిషం నిశ్శబ్దం. నాటకం తిరిగి ప్రారంభమవుతుంది. భరతుని మెడలో దండ అలాగే ఉంటుంది.]

భర — అగ్రజా ! శ్రీరామచంద్రా !

" దేవ కైకేయి కీడు చింతించి
పాపనింద కింతయు రోయక నిన్నడవి
కరుగుమని యన్నమాటకు నరుగ ధర్మ
మగునె ? విచ్చేయు, మీతెంపుదగునెనేయ " ;

శ్రీరామచంద్రా ! కైకకోర్కె మన్నించదగునా !

కైక — (అకస్మాత్తుగా ఒక్కఉరుకు ఉరికి లోపలికొస్తుంది) మన్నించదగదు. రామా, మన్నించదగదు. పశ్చాత్తప్తదగ్ధను, నాయనా, నన్ను కరుణించవా ! మందర దుర్బోధలవల్ల నేనట్టి కోరికను కోరితినిగాని, నీవన్న నాకు ప్రేమలేదా ? ఆసంగతి నీకు మాత్రము తెలియదా ? నీతల్లి కౌసల్యకన్న నేనే యెక్కుడు ఆదరానురాగములతో నిన్నులాలించెడిదానననని ఎన్నిమార్లనలేదు. రామా ! నామాటమన్నించి పురికిరమ్మా. ఈభరతుడు నన్ను అనరాని దుర్భాషలాడి నిద్రపోనీయుటలేదు. భర్తను చంపు కొంటినన్న నిందఎటులవచ్చినది. నీవు తిరిగి పురమునకు రాక పోయిన నిన్నరణ్యముల పాలుచేసితినన్నవాదుకూడ నాతలను శాశ్వతముగ జుట్టుకొనును. ఆ అపకీర్తి నేభరింపజాల. ఈభర తుని తిట్లుతింటూ నే బ్రతకజాల. రానని నిరాకరించకు. నిరాక రించిన, కరుణాసముద్రా, రామభద్రా, నాతల నీమ్రోల వ్రక్కలు చేసుకొని అసువులు బాసెద (అని రాముడికాళ్ళు పట్టుకుంటుంది. వొదలదు )

[ఆడియన్సులో ఒకపక్కనించి చప్పట్లు.]

ఒకడు — వండర్‌ఫుల్.

మరోడు — ఎక్సెలెంటు బ్యూటిఫుల్. వన్సుమోర్.

[రాముడికి ఏంచెయ్యాలో తెలియదు. ఈ సీనులో కైక ప్రవేశం అసలు నాటకంలో లేదు. ఒక్క సెకండు నిశ్శబ్దం రాముడు పైమీద వల్కలం తీసి నేలకేసి కొట్టి, కోపంతో]

శ్రీరా — ఛీ ఛీ. (అని గబ గబ లోపలికి వెళిపోతాడు)

[ఆడియన్సులోనించి ఈలలు చప్పట్లు భరతుడు కైక కేసి కొరకొర చూస్తాడు. కైక లెక్కచెయ్యకుండా]

కైక — శ్రీరామచంద్రా, శాంతమూర్తివి. నీకే కోపము తగునా (అని ఠీవిగా నడిచివెళిపోతుంది)

[ప్రేక్షకుల్లోంచి ఈలలు చప్పట్లు ఎక్కువవుతాయి. గ్రీన్‌రూములోనించి తెర; తెర తెరవెయ్యండి అని కేకలు. తెరదింపేటందుకు సూచనగా విజిలు, తెర పడడం ప్రారంభిస్తుంది] 9104

(ఆడియన్సులో ఒక ప్రేక్షకుడు లేచినించుని: తెర వెయ్యకండి. తియ్యండి తెర. అని గట్టిగా అరుస్తాడు. తెర మధ్యలో ఆగిపోతుంది. వెనకాలనించి మళ్ళీ గట్టిగా విజిలు. "వెయ్యి తెర" "వెయ్యి తెర" అని కేకలు. తెరకొంచెం దిగుతుంది.)

మొదటి ప్రేక్షకుడు — తెరవేస్తే చింపిపారేస్తాం! జాగ్రత్త! తియ్యండి తెర! (తెర మళ్ళీ పైకి లేస్తుంది. మొదటి ప్రేక్షకుడు స్టేజిమీదికి ఉరుకుతాడు. అతని వెనకాల అయిదారుగురు స్టేజి ఎక్కుతారు. వాళ్ళలో ఒకడు జాబాలి గడ్డంపట్టుకు పీకబోతాడు. రెండోవాడు వశిష్ఠుణ్ణి బెదిరిస్తాడు. జాబాలిగడ్డం ఊడబెరుక్కుని లోపలికి పారిపోతాడు. వశిష్ఠుడు గోచీసవరించుకుంటూ పారిపోతాడు. ప్రేక్షకులు కొంతమంది లోపలికి వెళతారు. సుమంత్రుడూ వెళిపోతాడు. స్టేజి మీద మిగిలిపోయిన భరతుణ్ణి జబ్బ పట్టుకుని.)

మొ. ప్రే. — అయితే, నాటకం ఆడు.

భర — మీరందరు స్టేజిదిగిపోయి, నటకులందరూ సమ్మేళన మైతే అలాగే ఆడతాం.

మొ. ప్రే. — సమ్మేళనం గిమ్మేళనం జాంతా నై. నాటకంవెయ్యి.

[లోపలినించి శ్రీరామచంద్రమూర్తి పాత్రధారి విశ్వనాథం గొంతుక వినిపిస్తుంది.]

విశ్వ — నేఛస్తే వెయ్యను.

[స్టేజిమీదికి గజగజ విశ్వనాథం ఒస్తాడు. కట్టుకున్నవల్కలం అలానేఉంది కాని, తలకి విగ్గులేదు. మామూలుక్రాపింగుజుట్టు. అతనివెనకాల రెండో ప్రేక్షకుడు ఒస్తాడు.]

రెం. ప్రే. — మంచిగా చెబుతూవుంటే మాటవిను.

విశ్వ — వెయ్యను. వెయ్యను, ఛస్తేవెయ్యను.

రెం. ప్రే. — అయితే ఇక్కడ నీకు ఎలాగా చావుతప్పదు.

విశ్వ — ఛస్తే చస్తాను, కాని వెయ్యను.

రెం. ప్రే. — ఎంచేత ?

విశ్వ — ఇది నాటకంగాదు కప్పలతక్కెడ.

రెం. ప్రే. — ఎంచేత ?

విశ్వ — ఆ భరతుణ్ణి అడుగు కైకేయిని అడుగు.

ఆడియన్సులోనుంచి — అరేయి కస్తూరీతిలకాన్నికూడా లాక్కుండిరా !

[స్టేజిమీదవున్న ప్రేక్షకుల్లో ఒకడు గ్రీన్‌రూములోకి వెళతాడు.]

రెం. ప్రే. — [విశ్వనాథాన్ని వొదలక] చెప్పు.

విశ్వ — అరే. నన్నుతగులుకున్నావేమిటి ! వాళ్ళనిఅడగ మన్నానుగా !

రెం. ప్రే. — ఎవడిక్కావాలి నీబోడిసలహా ! నాయిష్ట మొచ్చినవాడిని అడుగుతాను. నిన్నడుగుతున్నాను. నువ్వేచెప్పు ! (అని ఉరుముతాడు)

విశ్వ — (కొంచెంజంకి) ఎవరిమటుకువాళ్ళు, యిష్టమొచ్చినట్టు, అసలు నాటకంలో లేనేలేని పార్టులన్నీ చదివి నటిస్తూంటే, కప్పల తక్కెడ గాక నాటకమేమిటి ?

[అంటూవుంటే వాలుజడ ముందుకేసుకొని, వొయ్యారంగా, కైకపాత్రధారిణి, కస్తూరీతిలకం ప్రవేశిస్తుంది. వెనకాల కొంతమంది ప్రేక్షకులుంటారు. ఆవిడని చూడగానే విశ్వనాథానికి మరింత వుద్రేకం ఎక్కువవుతుంది]

విశ్వ — చిత్రకూటపర్వతందగ్గిర సీనులో, కైక స్వయంగా వొచ్చి పశ్చాత్తాపపడడం, శ్రీరామచంద్రుణ్ణి బతిమాలడం ఎక్కడైనా, ఎప్పుడైనా చూశారా ! అయినా నాటకమధ్యంలో అక స్మాత్తుగా వొచ్చేసి, ఇష్టమొచ్చిన నాటకం ఆడేస్తూవుంటే, ఈవిడని, 'ఎందుకిలా చేశావు' అనేమొగాడు లేకపోయాడు !

కస్తూరీతిలకం — నన్నేగాదు. ఎందుకు మీసొంతపైత్యాలు పెట్టారయ్యా అని మిమ్మల్నీ, నారాయణగార్నీ కూడా నిలవతీసి అడగొద్దూ. తిన్నగా నాటకం ఆడించేమొగాడు లేకపోయాడు కనకనే, ఆడదాన్ని నేనూ నోరుచేసుకోవలసొచ్చింది.

ఆడియన్సులోనుంచి — భేష్ : భేష్ : మంచిజవాబు చెప్పావు.

నారా — కస్తూరితిలకం. అనవసరంగా నాపేరుఎత్తిందికనక, నే మాట్లాడవలసొచ్చింది. నేప్రవేశపెట్టిన పాత్రోచితమార్పులకీ, ఈవిడచేసిన మార్పులకీ హస్తిమశకాంతరం తేడావుంది. నే జేసిన మార్పు రసోత్పత్తికి దోహదమయితే, ఈవిడచేసినపని రసాభాసకి దారతీసింది. పుసిచూసి నక్కవాత పెట్టుకుందిట!

క॥ తి — డబ్బీలు కొట్టకు. నువ్వేం పులివికావు. పందివి. పందికొక్కువి.

నారా — పురాణం విప్పకుతల్లీ! చదువుకున్న వాళ్లం! సంస్కారంగల నటులం! ఆ త్రోవని నీతో అట్టేదూరం ప్రయాణం చెయ్యలేము.

క॥ తి — పెద్దకబుర్లు చెప్పకు. నాయెంగిలి తిన్నాడివి.

నారా — నువ్వు స్త్రీ వైపోయావుగాని

క॥తి — పెద్ద మొగా డొచ్చాడయ్యా!

ఆదియన్నులోంచి: రామాయణంలో పిచికలవేట! నాటకం త్వరగా ఆడించే ప్రయత్నం చెయ్యండి బాబూ. కాళ్లు పీక్కుపోతున్నాయి. ఒంటేలికూడా వెళ్ళడానికి వీల్లేకుండా కూచున్నాం.

విశ్వ — ఈనాడు కైక ఆమాటకొస్తే, భరతుడు, తమ పాత్రల్ని ఇష్టమొచ్చినట్టు పెంచుకుని తారుమారుచేసి, నాటకం తగలెట్టారు. ముఖ్యంగా, నాపాత్రని నేను పోషించుకోడానికి వీల్లేకుండా తగలెట్టారు. ఇలాటి పరిస్థితుల్లో నేను నాటకం వెయ్యలేను. వెయ్యను.

నారా — విశ్వనాథంగారు ఆలోచించి ఆడినమాటలుకావు! నేను నాటకం తగలడే మార్పులుగాని, వారి పాత్రపోషణకి లోపం కలిగించే మార్పులుగానీ ఏమీ చెయ్యలేదు. నేను ప్రవేశ పెట్టిన ప్రతిమార్పూ కొన్ని నెలలు ఆలోచించి, రసోత్పత్తికి తోడ్పడతాయన్న సంగతి నిరూపించుకున్న తరవాతే ప్రవేశ పెట్టాను. పాదుకాపట్టాభిషేకంలో, భరతుడి పాత్ర రత్నాలు పొదిగిన ఒక బంగారు ఆభరణం. నేను చేసిన మార్పులు, ఆ బంగారానికి పెట్టిన మెరుగులు. వాటివల్ల భరతుడి గొప్పతనం, ఔదార్యం, భ్రాతృసేవాత్వం మరింత ప్రకాశిస్తాయి. కనక ఆ మార్పులు చెయ్యడానికి హక్కుంది, నాకు.

విశ్వ — ఉన్నపద్యాలు ఎగరగొట్టీ, లేని పద్యాలు పెట్టీ నేను ఎక్కడ అందుకోవాలో, ఏసంభాషణలు చెప్పాలో తెలియకుండా గజబిజ చేశావు.

కృతి — నాపార్టులో రెండు పేజీలు ఎగర గొట్టించేశాడు. తన పాత్రకి మెరుగులు పెట్టాట్ట! చుప్పనాతి! నాకు మసి పూద్దామని చూశాడు!!

నారా — అబద్ధం.

కృతి — తెలుసుకోలేని వాళ్లదగ్గిర కొయ్యి! ఆడియన్సులో ఎంతమంది ఈసంగతి కనిపెట్టి పరిగెత్తుకొచ్చి నాతో చెప్పలేదు? పోనీగదా అని వూరుకుంటే, సీనుమధ్యలో నాటకం ఆపించి దండ వేయించు కుంటాడు! చాలా గొప్పనటకుడట! కళారాధ

కుడట : మేంకాదూ ? అంచేతే, నా నటనాసామర్థ్యం, ఢంకా మీద దెబ్బకొట్టి చూపించడానికి, అప్పటికప్పుడు పోర్షన్ వ్రాయించు కుని, వొచ్చి, ఆక్టుచేసి ప్రోజుకిగూడా వన్సుమోరనిపించుకున్నాను. (ఆడియన్సు వైపుకి తిరిగి) ఈ నారాయణగారు చేసింది తప్పుకాక పోతే నే జేసినదీ తప్పుకాదు. అసలు నాటకంలో లేని ముక్కలు గాని, పద్యాలుగాని చదవడానికి ఆయనకెంత హక్కుందో నాకూ అంతే హక్కుంది.

ఆడియన్సులోనించి ఒక కవి : ఒక కవి వ్రాసిన నాటకం దిద్ది రాసెయ్యడానికి, ఆనాటకంలో వచ్చే నటుకు లందరికీ హక్కులు తగలడితే, నాటకం తగలడకుండా ఎందుకుంటుంది చెప్పండి.

నారా — అందరికీ హక్కుందని నేను అనలేదు. అనను. అర్హతనుబట్టి హక్కు.

కవి — [స్టేజిమీదికొచ్చి] నేను ఒక కవిని. తగాదా, నటకుల తగాదాగానే వున్నంతకాలం నేజోక్యం కలుగజేసుకోలేదు. కాని మీవాదం కవికీ నటుడికీ లడాయిపెడుతోంది. చేసినమార్పుల మంచిచెడ్డల్ని గురించి మీలోమీరు తగాదా పడుతున్నా మీనటకు లందరూ, నాటకంలో మార్పులుచెయ్యడానికి హక్కుగాని, హర్హతగాని వుందనే ఋజాయిస్తున్నట్టు కనిపిస్తుంది. నాటకం ఒకకావ్యం. ఒకరమ్యకావ్యం. ఆనాటకకావ్యం వ్రాసినవాడుకవి. ఆకావ్యాన్ని సంస్కరించడానికి అర్హుడు కవేగాని నటకుడుకాదు.

నటకులు చిత్తానుసారం నాటకం మార్చడం అనర్థం. హద్దుమీరి ప్రవర్తించడం.

సారా — నాటకం ఒక రమ్యకావ్యమేగాదు; ; ఓ దృశ్యకావ్యం. ఆ దృశ్యత్వం వివరించి ప్రత్యక్షం చెయ్యగలిగేది, చేసేది నటకుడు. కాగితాలమధ్య మరుగుపడిపోయిన పాత్రలకి ప్రాణమిచ్చి, పోషించి, విహారంచేయించేది నటుడు. నాటకానికి ప్రాణం నటుడు. నాటకాన్ని పాత్రపోషణనిమిత్తం, పాత్రౌచితి నిమిత్తం, రంగప్రదర్శనానికి అనుకూల్యత నిమిత్తం, సంస్కరించడానికి నటుడికి హక్కు లేకపోవడమేమిటి ? అర్హతలేకపోవడమేమిటి ?

కవి — నాటకానికి ప్రాణం కవితాపటిమగాని నటుడుకాదు. పాత్రకి ప్రాణమిచ్చేది నటుడనుకోడం భ్రమ. కవిసృష్టించి, సజీవంగా చేసిన పాత్రకి నటుడు దుస్తులుతొడిగి కాస్త సింగారిస్తాడు అంతే. ఆతర్కంలోకెందుకులే....నువ్వన్నట్టు పాత్రకి ఓ సజీవత్వంకలిగించింది నటుడే అనుకో. ఒక్కొక్కపాత్రకి, ఒక్కొక్కనటుడు, జీవంపోస్తాడు. ఇన్నిజీవాలు, పాత్రలు, సమన్వయించుతున్నది, నాటకం. ఏనటకుడికి, ఆనటకుడు, తన పాత్రని సంస్కరించుకోడానికి హక్కుందని, అర్హతుందని, దాన్నితెంచి, పెంచి, పోషిస్తే నాటకం గతేమవును ? పైగా నాటకం వ్రాసిన కవికి నీకున్నపాటి తెలివితేటలు, సామర్థ్యంలేవని. పాత్రౌచితి రంగప్రదర్శనపు అవసరాలు తెలియవని ఎందుకను కుంటావు వెఱ్ఱినాయనా ?

నారా — తెలివితేటలు సామర్థ్యం లేవనను. మాకున్న అనుభవం లేదంటాను. అనుభవ లోపంవల్ల శిల్పలోపం వుందంటాను. ఆ కొరతతీర్చడానికి నటుడు నాటకాన్ని సంస్కరించడానికి అర్హుడంటాను.

కవి — నువ్వుచెప్పిన అనుభవలోపం నిజమైనా, నాటకాన్ని సంస్కరించగలది నటుడని తేలదు. నాటకం ఆమూలాగ్రం అవగాహన చేసుకుని, రసభంగం కలగకుండా బాధ్యత నిర్వహించగల, సూత్రధారుడో, డైరెక్టరో, అర్హుడుగాని, సంకుచిత దృష్టితో, తనపాత్ర విజృంభణకోసమే పాటుపడేనటుడు కాడు. అతనైనా నాటకంలో చెయ్యదగినమార్పు, రంగానుకూలత కోసమేగాని పాత్రపోషణ వగైరాలకోసంకాదు. ఆబాధ్యత ఎప్పుడూ కవిదే.

నారా — సూత్రధారుళ్ళూ, డైరెక్టర్లూ, మననాటకాలకి లేకపోవడంవల్లనే ఆబాధ్యత నటుడిమీద పడిందనుకోండి, నాటకాన్ని సంస్కరించడానికి నటుడు అర్హుడు. ఆ అర్హతకి పరిధులులేవు. కారణం: ప్రేక్షకుల అవసరాలు, అభిరుచులు, నాకు — నటుడికి తెలిసినంతగా, మీకు — కవికి తెలియవు.

ఆడిటమ్సులోపించి ఒకడు — ఓయబ్బ! మాసంగతి నీకంతగా తెలిస్తే, తిన్నగా నాటకమాడక ఈగొడవేమిటి ? మాటలన్నీ కట్టిపెట్టేసి, నాటకం కానివ్వండి. విశ్వనాథంగారు! అనవసరంగా జెల్లలు తినకండి.

[నాటకం వెయ్యనని విశ్వనాథం తలూపుతాడు]

ఆడియన్సులోనుంచి రెండోవాడు — ఇహ వీళ్ళు నాటకం వేసే దేమిటోయ్. కమ్మగా నాలుగు పద్యాలూ, పాటలూ పాడి పోతున్నారు!

ఆడియన్సులోనుంచి మూడోవాడు — బెస్టు!

ఆ. రెం. — విశ్వనాధంగారూ మీరు నాటకం ఆడొద్దు. "స్థిరమైన నడవడి" పద్యం ఒక్కటేచదివి నాలుగు యెంకి పాటలు పాడెయ్యండి: మిమ్మల్ని వొదిలేస్తాం.

విశ్వ — దానికి నాకు అభ్యంతరం లేదు.

కవి — [నారాయణతో] ప్రేక్షకుల అవసరాలు, అభిరుచులు తెలుసు నాయనా, సీకు, పాదుకాపట్టాభిషేకంలో శ్రీరామచంద్రుణ్ణి యెంకిపాటలు పాడమని కోరే ప్రేక్షకులదేనా?

ఆ. రెం. — ఏమండోయ్ కవిగారూ మామీదేవో విసురుతున్నారు. మేమేం బేవార్సుగా నాటకానికి రాలేదు. అయిదురూపాయలు పెట్టి టిక్కట్టుకొనుక్కుని మరీవొచ్చాం. చెమటోడ్చి సంపాదించిన సొమ్ము. మాడబ్బువిలువ మాకుముట్టకుండా యెగేస్తామంటే ఊరుకునేదిలేదు. తిన్నగా నాటకం ఆడితే తిన్నగా నాటకం చూసిపోదుం. మధ్యలో రభసచేస్తే యెంకిపాటలు పాడమన్నాం. తప్పేమిటి?

ఆ. మూ. — నాటకం నోటీను చూశారా కవిగారూ! విశ్వనాధంగారు అద్భుతంగా యెంకిపాటలు పాడుదురు అని నోటీసులో అచ్చేశారు.

నారా — అసలు సరుకులేకపోతే చీప్ పాప్యులారిటీకోసం ఇలాటి ఎత్తులు తప్పవు!

విశ్వ — పాప్యులారిటీకోసం బోగంటక్కు—లేసేది నువ్వు! నావి యెత్తులట! నేనుచేసేది కళారాధన!

నారా — ప్రేక్షకుల క్షుద్రకోరికలకి, అభిరుచులకి ప్రోత్సాహమివ్వడం.

ఆ. రెం. — అయ్యో! నారాయణగారు, మాటలు తిన్నగా రానివ్వండి. ప్రేక్షకులవి క్షుద్రకోరికలనకండి. వాళ్ళకి నాటకాలు చూడాలని కోరికలుండబట్టీ, ఆకోరికలు తీర్చుకునేందుకు డబ్బు తగలేసుకోడానికి సిద్ధంగావుండబట్టీ, మీరు బతుకుతున్నారు. నాటకాలు, ఈమాత్రంగానైనా బతుకొస్తున్నాయి!

ఆ. మూ. — మేమే స్ట్రిక్టుగావుంటే, నాటకాన్ని మీరు చేసే ఖూనీలకి మిమ్మల్నిక్కడ పాతెయ్యకుండా వుందుమా? ఈనాటకంలోనే, మొదటినుంచీ ఎన్నిఅభాసులుచేసినా వూరుకోలేదూ? వెయ్యిమందిపట్టే హాలులో రెండువేలటిక్కెట్లు అమ్మారు. పేర్లువేసిన నటకులు రాలేదు. సీతమ్మగారు ఆఖరిసీనులో రావలసింది రాకుండా పెందరాళే రైలెక్కేసింది. ఓటోకు లక్ష్మణుడు, పద్యాలన్నీ దాటేశాడు.

నారా — వాటన్నిటికీ మేం బాధ్యులంకాము. ఈనాటకం ఆడిం చిన కంట్రాక్టర్ని అడగండి.

ఆ. రెం. — డబ్బుచేతులో వేసుకున్నాక కంట్రాక్టరెక్కడ కనిపిస్తాడు.

నారా — అదేవొచ్చిన ఖర్మం. ఈనాటి నాటకాల సంధాన కర్త కేవలం ధనాశాపరుడైన కంట్రాక్టరవడం, మనదౌర్భాగ్యం. కంట్రాక్టరు నాటకాలకి పట్టిన చెదపురుగు.

[తెరవెనకనించి కంట్రాక్టరు వొస్తాడు]

కంట్రా — ఉరిమిఉరిమి మంగలంమీదపడిందిట ! మీరందరూ విరుచుకుపడడానికి కంట్రాక్టరు తేరగాదొరికాడా ! ఈవూళ్ళో నాసొంతసోడాదుకాణముంది. బెస్టురంగులు మాషాపులోనే దొరుకు తాయి. నాదుకాణంమీద ఘరానాగాబతికే పెద్దమనిషినినేను. డబ్బు చేతులో వేసుకోగానే పరారీ అయిపోవలసిన అవసరం నాకేంలేదు. వెయ్యిమంది పట్టేహాల్లో రెండువేల టిక్కట్లు అమ్మేనన్నారు. అబద్ధం ! హాల్లో పదిహేనువేలమందికి టిక్కట్లు అమ్మొచ్చు నని, పోలీసు, మునిసిపలు పర్మిట్లున్నాయి. ఎలా ఇచ్చారో వాళ్ళనే అడగండి. మిగతా అయిదొందలూ జేవాప్సులూ, కాంప్లిమెంట రీలూ ! ఈహాలు కిక్కిరిసిపోయింది నిజమే ! ఎంతమంది అసలు టిక్కెట్టే లేకుండా చూస్తున్నారో లెక్కెట్టండి ! ! పోలీసుడిపార్టుమెంటుకి, మునిసిపాలిటికి, కలెక్టరాఫీసుకి, ఎన్టర్ టెయిన్‌మెంటుటాక్సు డిపార్టుమెంటుకి, ఆఫీసర్లకి, గుమాస్తాలకి, డఫేదార్లకి అందరికీ కాంప్లిమెంటరీటిక్కెట్లు. డబ్బుకోసం నే

కంట్రాక్టు పుచ్చుకున్నానని నామీద ఓపెద్దనిందా ? ఏమరండీ, డబ్బు కోసం కాకుండా ఏపనైనా చేస్తున్నది. కళకోసం కడుపుమాడ్చు కుంటున్నట్టు మాట్లాడుతున్న నారాయణగారు, నాటకానికి రెండొందలు పేలేసిపుచ్చుకోడంలేదూ ? అద్వాన్నంగాకూడా ఏకా రణంచేత నయినా నాటకం ఆగిపోయినా, సొమ్మువాపసు ఇవ్వరు. విశ్వనాథంగారు లోగడ రెండువందలకొచ్చేవారు. వారి యొక్కి పాటల గ్రామఫోనురికార్డు చెలామణిఅవడంతో రేటుపెంచారు. ఈఖర్చులన్నీ పెట్టగా, నాకు నాటకంమీద ఓపదరూపాయలన్నా మిగలవు ! మొత్తంమీద నా సోడాకొట్టుమీద సంపాదించినసొమ్ము ఈనాటకాలమీద పెట్టాను. నాకు నాటకాలంటే పిచ్చిసరదా ! మావాళ్ళందరూ, నష్టపోతున్నావు, వొద్దని పోరినా విడిచిపెట్టక నాటకాలాడిస్తున్నాను. చెప్పండి ఇప్పుడు ఎవరు కళాభిమానులో, ఏవరుడబ్బుకోసం నాటకాలేస్తున్నారో ? డబ్బుతిన్న విశ్వాసంలేక నాటకం కంగాళీచేసి పైగా నన్నంటారా !

మొదటిప్రేక్షకుడు — చాలించండయ్యా ఈచర్చలు చెవులు హోరెత్తి పోతున్నాయి. తప్పెవరిదయితే ఎవరిక్కావాలి నాఅయిదురూ పాయల టిక్కెట్టుఫలం నాకు ఎదోరూపేనా ముట్టించండి నారాయణ గారూ ! నాలుగుపద్యాలు రెండునెలలు ప్రాక్టీసు చేశామన్నారు. రెండుచదివారు : మిగతా రెండూకూడా చదవాలి. విశ్వనాథం గారు స్థిరమైననడవడి చదివి, నాయుడు యొంకిపాటలు విసరాలి.

అడియన్సులోనించి — అవునవును. పాడాలి. పాడాలి.

[అని కేప్పట్లు : ఈలలు]

మొ. ప్రే. — నారాయణగారూ మొదలెట్టండి. [హార్మోనియమ్ వాయించడానికి విజిలు. నారాయణ మొదలెట్టాడు]

ఆడియన్సులోనించి ఒకడు — అంతా నీయిష్టమే! రెండొందలు మింగేసి పద్యాలు చదవడుట.

నారా— సౌమ్యం పుచ్చుకున్న మాట వాస్తవమే. అదిభరతపాత్ర ధరించడానికి. సందర్భం లేకుండా పద్యాలు చదవడానికికాదు.

ఆ॥ ఒకడు — అయితే నాటకం వెయ్యి.

నారా — నటసమ్మేళనం సక్రమంగా జరిగితే వెయ్యడానికి నే సిద్ధమని మొదటే చెప్పాను.

విశ్వ — ఈ పరిస్థితుల్లో వెయ్యనని నేనూ చెప్పాను.

ఆ॥ ఒకడు — అయితే అందర్నీ దంచుతామని మేమూ చెప్పాం..........చూస్తారే..........తన్నండి [తన్నండి తన్నండి అని కేకలు. స్టేజిమీదికి చాలా జనం చేరిపోతారు. కొంతమంది నారాయణచుట్టూ, మరికొంతమంది విశ్వనాథచుట్టూ చేరతారు. కైక ఎప్పుడో మెల్లిగా పైకి జారుకుంది].

కంట్రా — [గుడ్లురుముతూ] ఆగండి. [అందరూ అతనికేసి చూస్తూ నిలుచునిపోతారు.] నాటకాలు చూసి, ఆనందించడంలో చాలా రసికులని మనవూరివాళ్లకి పేరు. వీళ్లని తంతే మనకి వొరిగేదేమీలేదు. పోయిన డబ్బు రాదు. చెడ్డపే రొస్తుంది.

స్టేజిమీదఉన్న ప్రేక్షకుల్లో ఒకడు — అయితే ఏంచెయ్యమంటా వయ్యా? శవరమయిపోయిందని, నెత్తిన ముసుగేసుకు పోవడమే? వాళ్లకి బుద్ధిచెప్పొద్దూ.

కవి — చేసిన తప్పుకి మరోతప్పు జోడిస్తే రైటవదు, పద్యాలూ యెంకిపాటలూ పాడమని దండించడం మూలాన వీరికి బుద్ధిరాదు. చేసే ఆభాసలకి ప్రేక్షకుల వక్రబుద్ధే కారణం అని దాచేసుకు పోడానికి అవకాశం ఇస్తారు. దీనికి మందు సక్రమమైన మార్గంలో నాటకం ఆడించి తీరడం. అప్పుడు బుద్ధొస్తుంది.

ప్రే॥ — అలా నాటకం ఆడకపోతే.

కవి — అప్పుడు దానికి దండించండి.

ప్రే॥ — ఏయి నారాయణా! విశ్వనాథం! విన్నారా తిన్నగా ఈ సీను మళ్ళీ వెయ్యండి. లేకపోతే వీపు హోరెత్తిపోతుంది.

కవి — ఇంతగాదు అంతా నాటక పాఠాన్ని ఎవరిష్ట మొచ్చినట్టు వారు సంస్కరించినందువల్ల వొచ్చింది. అలా చెయ్యకుండా వుంటామని హామీ యిచ్చి నాటకం ప్రారంభించండి.

ప్రే — అవునవును. ఇహ నెప్పుడూ సొంతపైత్యాలు పెట్టమని లెంపలేసుకోండి. ఊఁ విశ్వనాథం! నారాయణ! మీరు వేసుకో పోతే మేం వేస్తాం!

నారా — జయప్రదమైన నాటకప్రవర్తనానికి ఒక ఉత్తమ నాటకం, ఉత్తమ నటకులు ఎంత అవసరమో, రసికప్రేక్షక జనం అంతే అవసరం [ప్రేక్షకులని చూపిస్తూ] మీరు హద్దుదాటి ప్రవర్తించి, నాటకంలో లేనిపాటలు, పద్యాలు పాడమని నిర్బంధిస్తూ, మమ్మల్ని ఈ విధంగా శాసించడానికి మీ కేమధికారముంది?

కవి — నిజం! నిజం! ప్రేక్షకులూ తమ విధులు నిర్వర్తించాలి. అప్పుడే ఇతరులని శాసించడానికి అధికారముంటుంది.

ప్రే॥ — [స్టేజిముందుకొచ్చి] అందుకు మేం తయారు. ప్రేక్షకు లందరి తరఫునా నేను హామీ యిస్తున్నాను. నాటకంలో లేని అసందర్భమయిన పద్యాలూ, పాటలూ పాడమని మేం ఎప్పుడూ కోరం. నాటకం సక్రమంగా ప్రదర్శించమంటాం. ఇదివరకు అక్రమమయిన, కోరిక కోరినందుకు లెంపలేసుకుంటు న్నాం [లెంపలేసు కుంటాడు. ఆడియన్సులోంచి చప్పట్లు] ఇప్పుడు వేసుకోండి. మీరుకూడా లెంపలు [అని నారాయణని, విశ్వ నాథాన్ని నిలవదీస్తాడు].

నారా — నే నేం తప్పు చెయ్యలేదు.

ప్రేక్ష — మరి లెక్చర్లివ్వకండి. మీరువేసుకుంటారా ! మమ్మల్ని వెయ్యమంటారా, చెప్పెయ్యండి ఆలస్యం జేస్తే, గుంజీలు తీయించి, గోడకుర్చీ కూడా వేయిస్తాం. ఊ [అని బానా మీదికి కొట్టేవాడిలా వెడతాడు నారాయణ జంకుతాడు].

నారా — ఏమన మంటారు.

కవి — నాటకప్రదర్శనానికి నటకుల కలయిక నటకులు ఒక్క సూత్రంమీద నడవడం అవసరం. స్వవిజృంభణ పనికిరాదు. ఈ సూత్రాలకి విరుద్ధంగా ఏమీ చెయ్యము అని హామీయిచ్చి, లెంపలేసుకోండి.

ప్రేక్ష — [ఉరుముతూ] వేసుకోండి !

[విశ్వనాథం, నారాయణ లెంపలేసుకుంటారు. ఆడియన్సులోంచి మళ్లీ చప్పట్లు]

కంట్రా — ఇంతమంది తెంపలేసుకుంటూ వుంటే నాకూ అదే బుద్ధిపుడుతోంది. ఇహానెప్పుడూ పలానిపాత్రధారి, నాటకంలో లేని పాటలు వగైరా పాడతాడని నోటీసులు పంచిపెట్టను. సక్రమంగా నడుస్తున్న నాటకసమాజాలనే పిలిపించి నాటకాలాడించడానికి కంట్రాక్టు పుచ్చుకుంటాను గాని, విడివిడిగా ఆక్టర్లని బుక్‌చేసి నాటకం ఆడమనను [అని తెంపలేసుకుంటాడు, చప్పట్లు]

కవి — మాటమీద నిలిచి, మనస్ఫూర్తిగా ప్రయత్నించి, సక్రమంగా నాటకాలాడితే ఆంధ్రనాటకరంగం దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది. నటనలో, నాటక రచనలో, అభిరుచి, రసికతలలో ఆంధ్ర నట, కవి, ప్రేక్షకులు భారతదేశంలో ఏప్రాంతీయులకి తీసిపోరు నాటకకళ ఆంధ్రులకి ప్రత్యేకఅభిమానకళ. ఒక్క సూత్రంమీద నడవడం, కలయిక, నాటకకళారంగంలో ప్రారంభించి సాధిస్తే, జీవితం అన్నిరంగాల్లోనూ సాధించగలమేమో! ఆ శుభపరిణామంకోసం ఆశించి, కాంక్షించి, కృషి చేద్దాం; అందరమూ కలిసి ఐక్యకంఠంతో అనండి. "ఆంధ్ర నాటకరంగానికి జై" [విశ్వనాథం, నారాయణ భుజంమీద చెయ్యేస్తాడు "ఆంధ్రనాటక రంగానికి జై" అన్న నినాదంతో హాలు మారుమ్రోగిపోతూ వుంటే. — తెర.]

---

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమహేంద్రవరము